# హెచ్చరిక

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి

చిన్నకథలూ,
నవలలూ,
నాటకాలూ,
[illegible],
పద్యాలూ,
మీగడతరకలూ,
ఖండకావ్యాలూ,
వర్ణచిత్రాలూ,
మెరుపుదెబ్బలూ,
వ్యాఖ్యానాలూ,
వ్యాసాలూ
మొదలయినవి

లిఖిత రూపంగా వారి అనుమతి పొందకుండా

భాషాంతరీకరణం, ప్రదర్శనం, బ్రాడ్‌కాస్టింగు,
రికార్డింగు, స్క్రీనింగు, అనుసరణం,
ముద్రణం, ప్రకటనం,
వగైరా యేవిధంగానూ యెవరూ
వుపయోగించుకో గూడదు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# కలంపోటు

ఇందులో

పునాది రాయి లక్ష్యసిద్ధి

అనే మరో రెండు

రూపికలున్నూ వున్నాయి.


కళాభివర్ధనీ పరిషత్తు

రాజమహేంద్రవరం

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# కలంపోటు

ఇందులో

పునాది రాయి లక్ష్యసిద్ధి

అనే మరో రెండు

రూపికలున్నూ వున్నాయి.


కళాభివర్ధనీ పరిషత్తు

రాజమహేంద్రవరం

# మహారాజపోషకులు

కళాప్రపూర్ణ, సాహిత్యసమ్రాట్టు

శ్రీ శ్రీ శ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజులుంగారు డి.లిట్.

# ప్రధానపోషకులు

శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు

ప్రొప్రయిటరు :— సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

కీ. శే. దురిశేటి శేషగిరిరావు పంతులుగారు, కాకినాడ

# పోషకులు

శ్రీ తూములూరి శివరామయ్యా పంతులుగారు

బి. ఏ., బి. ఎల్., అడ్వకేటు, నెల్లూరు

శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు

ప్రొప్రయిటరు : వావిళ్ల రామస్వామిశాస్త్రులు & సన్సు. మద్రాసు

శ్రీ ఏడిద వెంకటరావు పంతులుగారు

భూస్వాములు, మహేంద్రవాడ

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు

బి. ఏ., సి. బి. యి., ఎమ్. పి. బుచ్చిరెడ్డిపాలెం

శ్రీ ద్వారంపూడి వెంకటరెడ్డిగారు

భూస్వాములు, అనపర్తి

శ్రీ వుప్పల శ్రీరామమూర్తిగారు

మిల్లుఓనరు, అనకాపల్లి

శ్రీ ఎం. వి. ఆర్. అణహరాచార్యులుగారు

అగ్రహారందారు, మద్రాసు

శ్రీ వి. నాగయ్యగారు

రేణుకాఫిలిమ్సు డైరెక్టరు, మద్రాసు

శ్రీ కెప్టెన్. తోలేటి కనకరాజుగారు

M. B. B. S., F. R. C. S. (E) రాజమండ్రి

శ్రీ వింజమూరి సూర్యనారాయణమూర్తిగారు

ప్రొప్రయిటరు : వినాయక కాఫీకంపెనీ, రాజమండ్రి

శ్రీ బుద్ధవరపు వేంకటసూర్యగోపాలం-సుబ్బారావుగార్లు

గ్రామకరణం అడ్వకేటు పొలమూరు

శ్రీ రావులపర్తి భద్రిరాజుగారు

భూస్వాములు వెల్లగ్రామం

శ్రీ పులుగుర్త వేంకటేశ్వరరావుగారు

భూస్వాములు పులుగుర్త

రాజవైద్య,

శ్రీ ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తిగారు

ప్రొప్రయిటరు : శ్రీ వెంకటేశ్వరాయుర్వేదనిలయం చింతలూరు

కీ. శే. సబ్బెళ్ల పద్దయ్యగారు కొంకుదురు

,, కర్రి చినవెంకటరెడ్డిగారు మూరుమేరు

,, చిట్టి నారాయణమూర్తిగారు తణుకు

,, ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు చింతలూరు

,, ద్వారంపూడి రామారెడ్డిగారు అనపర్తి

# సమర్పణం

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి,
వారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భాన,
సమ్మాన సంఘంవారు
దేశీయుల భూరివిరాళాలతో అచ్చుచేయించి
సమర్పించిన పుస్తకం యిది

# పాత్రలు

కృష్ణ దేవరాయడు
తిమ్మరుసయ్య
ముక్కు తిమ్మన్న
అల్లసాని పెద్దన్న
ధూర్జటి కవి
మాదయగారి మల్లన్న
తిమ్మన శిష్యుడు
మంగ
మరి కొందరూ, సభ్యులూ

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# కలంపోటు



## మొదటి రంగం

స్థలం :— విజయనగరాన, శ్రీకృష్ణదేవరాయని సభాభవనం "భువనవిజయం"

సమయం :— సాయంకాలం, ఇక పొద్దుగుంకుతుం దనగా.

ఝాం ఝుకారా మంటూ నగారా మోగసాగింది.

వెంటనే కొలువు చాలించి, రాయడు, వాసగృహానికి వేంచేశాడు.

కట్టలు తెగిన చెరువునీటిలాగ సభ్యులు అన్నిద్వారాల నుంచీ బయటికి వచ్చి, అక్కడక్కడ నిలిచికొందరూ, నింపాదిగా అడుగు వేస్తూ ముక్కు తిమ్మన్న రచనమీద విమర్శ సాగిస్తూ కొందరూ, కొంచెం వడిగానే వెళ్ళిపోతూ తారసపడిన పరిచితులను పలకరిస్తూనూ పలకరించినవారికి బదులు చెబుతూనూ కొందరూ, యెవరికోసమో యెదురుచూస్తూ కనిపెట్టుకుని కొందరూ ఆవరణ అంతా నిండివున్నారు.

పడవాళ్లూ, దళపతులూ, మంత్రులూ, రాజబంధువులూ తారసపడ్డప్పుడు పౌరసామాన్యమూ, కవులూ, పండితులూ తారసపడ్డప్పుడు ఆపడవాళ్లు మొదలైనవారూ నమ్రులవుతూ వినయవిధేయతలు కనపరుచుకుంటున్నారు.

దూరాన, పొగడచెట్టుకింద, ముక్కుతిమ్మకవి నుంచుని వున్నాడు. శిష్యుడొకడు యెదట నుంచుని మాట్లాడుతున్నాడు. ఉండుండి వొక్కటొక్కటిగా పొగడపువ్వులు వారి మీద రాలుతున్నాయి.

---

తిమ్మకవి — బాగుంది.

శిష్యుడు — ఖండితనాయికా, దక్షిణనాయకుడూ, ఆపైని నారదమహర్షీ — ఇది మిక్కిలీ విశిష్టమైన సన్నివేశం కనక, యెలాంటి కల్పన కయినా అవకాశం వుందనీ, తమ రీ అవకాశం పూర్తిగా సఫలం చేసుకుంటా రనీ —

తిమ్మకవి — ఎవరి మాట అది ?

శిష్యుడు — ధూర్జటికవిగారి దండి.

తిమ్మకవి — అలా చెప్పుమరి. స్తుతమతులు కనక, వారికే తోచే మాట అది.

శిష్యుడు — వారింకోటి కూడా అన్నా రండి.

తిమ్మకవి — ఏమనీ ?

శిష్యుడు — సత్యాకృష్ణుల అంతఃపురికవిలాసాలలో మిక్కిలీ రసవత్తర మైనది రేపటి సభలో —

తిమ్మకవి — (తల పంకించుకుంటూ) అందుకోసం నిరీక్షి స్తున్నా రన్నమాట వారు.

శిష్యుడు — పింగళి సూరన్నగారూ, బట్టుమూర్తి తెల్ల వారితే యెక్కడికో ప్రయాణం ; కాని వా రది మాను కున్నారు కూడానండి, ధూర్జటిగారి మాటమీంద.

తిమ్మకవి — (పక్కకిచూస్తూ, స్వగతం) రేపటి ఘట్టం — అలా నడిపించామూ ? బులబులాగ్గా లేదు, మంచి పొంకంగానే వుంది. (కళ్ళుమూసుకుని)౹ వెలితి కనపడుతోందా ?...... రసికుల ప్రశంసలు పొందగలమా పొందలేమా ? (ఆలోచించి, తలపంకించి, శిష్యుడితో ప్రకాశంగా) సరే, తరవాతా ?

శిష్యుడు — దానిమీంద ఆంధ్రకవితాపితామహు లందు కున్నారండి.

తిమ్మకవి —(ఆత్రంగా) వా రేమన్నారూ ?

శిష్యుడు — "ఏమహాకవికీ అందని వస్తువు చేపట్టారు తిమ్మకవి అన్నగారు. వారి సత్యభామాదేవమ్మగారు ఆంధ్ర వాఙ్మయానికి ప్రశంశాభాజన మైన విశిష్టత చేకూరుస్తారు—"

తిమ్మకవి —(చెయ్యి జాడించుకుంటూ) సెబాస్ ! మహా మంచిమాట విన్నాం. రచనలో నవ్యత కనబరిచిన వారు, వారు. ఈమాట అనడానికి వారికే అర్హత వుంది. (సాలోచనగా, కొంచెం కిందుగా, పక్కకి చూస్తూ, స్వగతం) రేపు సభలో మనకి పరీక్ష అన్నమాట. వొట్టి పరీక్ష కాదు, అగ్నిపరీక్షే అన్నమాట. అయితే, ఆమహామహుల పురుూతలకు (పైకి

చూస్తూ) సాఫల్యం కలిగించగలమా ? (తల పంకించుకుని శిష్యు డితో ప్రకాశంగా) సరే, యింకేమిటి ?

శిష్యుడు — ప్రాజ్యకర్ణాటకసామ్రాజ్యం యిక పారిజాత దివ్యసౌరభాలతో గుబాళిస్తూ అజరామరం అవుతుందనీ —

తిమ్మకవి — (తల తాటించుకుంటూ దృఢంగా) కావాలి. (సాలోచనగా పైకిచూస్తూ స్వరం తగ్గించి కొంచెం మందంగా) కా — వా — లి. (కిందికి చూస్తూ) ఏదో అనుమానం పీకుతోం దేమిటి ? ఎప్పుడూ లేంది ఆరాటమున్నూ కలుగుతోం దేమిటి ?

శిష్యుడు — మరిన్నీ - (తిమ్మకవి వాలకం కనిపెట్టి మాట తేల్చేస్తాడు)

తిమ్మకవి — (ఆలోచించి ఆలోచించి ఉలిక్కిపడ్డట్టు) ఊఁ, తరవాతా ?

శిష్యుడు — తిమ్మకవిగారి పోకడలు బాగా గమనించు కుంటూ వుండమని తమ శిష్యులకున్నూ చెప్పారండి, వారు.

తిమ్మకవి — (ఇంకా ఆందోళనగానే వున్నాడు. అయినా, యీమాటమీద కొంచెం వుల్లాసం కలిగింది. దాంతో, కొంచెం మందహాసం కనపరుస్తూ) ఏమన్నా అనతగ్గవారే వారు. ఆంధ్రకవితాపితామహుల ఆదరగౌరవాలు సంపాదించు కుంది, కనక, పారిజాతాపహరణం యిక ఆచంద్రతారార్కం అయిపోతుంది. (కిందికి చూస్తూ) నిజమే; కాని అయితే —

శిష్యుడు — కాని —

తిమ్మకవి — (ఉలిక్కిపడి) మరి, కానీ అంటే ?

శిష్యుడు — మహామంత్రి తిమ్మరుసయ్యవారు కలుసుకున్నా రండి, అంతలో వచ్చి.

తిమ్మకవి — (ఆదుర్దాగా) వారితోనున్నా వచ్చిందా యీప్రస్తావన ?

శిష్యుడు — వచ్చిం దండి. అల్లసానివా రే తెచ్చారండి.

తిమ్మకవి — ఏమనీ ?

శిష్యుడు — అంతఃపురాన తిరుమలదేవమ్మవారి కెలాంటి పదవి వుందో, విజయనగరాస్థానకవిమండలిలో తిమ్మకవి అన్న గారి కలాంటి పదవి —

తిమ్మకవి — ( చిటికె వేసి ) అదిగదీ మాట. కోట్ల విలవ అయిన మాట అది. నేను తిరుమలదేవమ్మవారితో వచ్చిన అరణపుకవిని కనకనూ, వొక కావ్యం అంకితం కూడా చేస్తు న్నాను కాబట్టిన్నీ, ప్రభువు, వొకటో రెండో నా కగ్రహారా లెలాగా దయచేస్తారు ; కాని ఆంధ్రకవితాపితామహుల ప్రశంస నా కంత కంటే గొప్ప సత్కారం. అందులోనూ, అది మహామంత్రులవారి సమక్షాన రావడం —

శిష్యుడు — నిజమే కానండీ, మహామంత్రులవారు —

తిమ్మకవి — (ఆత్రంగా) వా రేమని సెలవిప్పించారూ ?

శిష్యుడు—సావకాశంగా నుంచుని, చిరునవ్వు నవ్వుతూ—

తిమ్మకవి—వారి మెప్పు పొందడం మాటలు కాదు. అసలు, వారు పైకి తేలనే తేల రోపట్టాన.

శిష్యుడు — ఇప్పు డలాగే జరిగిందండి.

తిమ్మకవి — (ఆత్రంగా) ఎలా జరిగిందీ ?

శిష్యుడు — మహాకవుల రచనల్లో వుండే మెళుకువలు అతి చమత్కారంగా విస్తరించే రసికచక్రవర్తులు వారు, అప్పుడలా యెందుకన్నారో గాని —

తిమ్మకవి — (విసుగ్గా వూగిపోతూ) ఏమన్నారు రా ?

శిష్యుడు — తిమ్మకవిగారు మిక్కిలీ ప్రౌఢులే. నిజంగా, వశ్యవాక్కులే. వారు చేపట్టినగాథా, చేసిన యెత్తుగడాకూడా అతి రసబంధురాలే ; కానీ —"

తిమ్మకవి — (గుంజుకుంటూ) ఏమికానీ, నీ మొహం కానీ ? మనస్సంతా చెడిపోయి అవస్థపడుతూ వుంటే వొకకేటే సాగ తీసుకోడమూ కానీ కానీ అంటూ ?

శిష్యుడు — మరి పూర్వాపరాలు —

తిమ్మకవి — అఘోరించావు, తొరగా కానియ్యవోయి, వాజమ్మా !

శిష్యుడు — (అసంతృప్తితో, కొంచెం చురుగ్గా) "కాని నే నిప్పు డొక రాజకార్యంలో పడికొట్టుకుంటున్నాను. ఎన్ని విధాల బుర్రచించుకున్నా దారీ తెన్నూ కనపడ్డం లేదు. ఈస్థితిలో వాఙ్మయవిషయం — అందులోనూ శృంగారకవిత్వం— అసలు కవిత్వమే నాతల కెక్కదు లెండి" అన్నారండి వారు.

తిమ్మకవి — (నిర్విణ్ణుడయి) ఏమిటీ ? తిమ్మరుసయ్యవారి మాటలా యివి ?

శిష్యుడు — అవునండి. నే నొక్క అక్షర మైనా విడిచి

పెట్టలేదండి. ఒక్క అక్షరమున్నా కలపలేదు కూడా నండి.

తిమ్మకవి —— (సాలోచనగా, కిందికి చూస్తూ) ఏమిటి దీని కర్థం? ఎన్ని తొందరపను లుండినా వారి బుద్ధి ఆరాటం మెర గదే? ప్రళయం వచ్చినా వారి ప్రకృతికి చలనం వుండదే? పైగా, యిది వాఙ్మయవిషయమా? కవిత్వం వారి తల కెక్కదూ?

శిష్యుడు —— ఇది విని పెద్దన్నగారున్నూ చకితు లయి పోయా రండి.

తిమ్మకవి —— అదలా వుండనియ్యి. మహామంత్రులవారి కొక రాజకార్యంలో దారీ తెన్నూ కనపడ్డం లేదూ? అలాంటి రాజకార్యం వొకటి నడుస్తూ వుండిన సమయాన, ప్రభువు, అంత నిశ్చింతగా — అంత వుల్లాసంగా కవితావినోదా లెలా సాగిస్తున్నారూ?

శిష్యుడు —— కొంప లంటుకునే దాకా ప్రభువులు వినో దాలు కట్టిపెట్టరుకా దండీ?

తిమ్మకవి —— అలా అనడానికి వీలులేదు. రాయలవా రెన్నడూ అంత మత్తులు కారు. (కళ్ళు మూసుకుని) మహా మంత్రికి కల్లోలాలా! రాయణింగారికి కవితావినోదాలా?

శిష్యుడు —— మీరు —

తిమ్మకవి —— నేను సావకాశంగా కావ్యపఠనం చేస్తూ —

శిష్యుడు —— అదే నేను మనవిచేసుకునేది. ఏదో విఘాతం ముంచుకువచ్చేటట్టుంది. కనక, గ్రంథం త్వరగా వినిపించేసి,

ఆరాజకార్యం : యేమిటో విషమించకుండానే అగ్రహారం పుచ్చేసుకుంటే —

తిమ్మకవి —— (విసుగ్గా) నువ్వు మాట్లాడకురా.

శిష్యుడు —— (కొంచెం వెనక్కి తగ్గి) మాట్లాడను లెండి.

తిమ్మకవి —— మాట్లాడనూ వద్దు, నువ్విక్కడ వుండనూ వద్దు, వెళ్ళిపో యింటికి.

శిష్యుడు —— వెడతానండి.

తిమ్మకవి —— వెడతానంటే కాదు, వెళ్ళాలి. పుస్తకం యింటో యిచ్చి, జాగ్రత్తచెయ్యమని చెప్పేసి — ఊఁ, వెళ్ళాలి.

శిష్యుడు ——( మెల్లిగా బయలుదేరతాడు )

తిమ్మకవి —— పెత్తనాలు చెయ్యక, తిన్నగా యింటికే వెళ్ళిపో.

శిష్యుడు —— (ఆగి, వెనక్కి చూస్తూ) అలాగేనండి.

తిమ్మకవి —— చూడూ, యీసంగతు లేవీ పైకి పొక్క గూడదు, తెలుసా ?

శిష్యుడు —— (మళ్ళీ ఆగి, వెనక్కి చూస్తూ) తెలుసునండి. ఎక్కడా పొక్కనివ్వనండి. (వెళ్ళిపోతాడు)

తిమ్మకవి —— (పచారుచేస్తూ) మహామంత్రులవారి ధోరణి యేమిటి ? ఎక్కడా కల్లోలాలు వినపడవే ? తలారి మొదలు దళపతి దాకా, కరణం మొదలు మంత్రుల దాకా — వొక్క ప్రధానామాత్యులు తప్ప — కల్లోలం రేగుతున్నట్టు మరె వరూ చెప్పరే ? ఎవరూ కంగారుపడుతున్నట్టునూ కన

పడదే? ప్రభువు ప్రవృత్తిచూస్తే యింత ప్రశాంతసమయం మరి వుండనే వుండ దన్నట్టు కనపడుతోందే? సామ్రాజ్యానికి సామ్రాజ్యం అంతా నిష్కంటకంగా నీరు పోసినట్టుండగా, వొక్క ప్రధానామాత్యులవారికే వచ్చిపడ్డాయా కల్లోలాలు?

కాక, — నాది శృంగార కవిత్వమా? పోనీ, నాది మట్టుకే శృంగారకవిత్వమా? ఇందులో పెద్దన్నగారు మాత్రం తక్కువ తిన్న దేమిటీ? అష్టదిగ్గజాలలోనూ శృంగారకవులే కాక, కొందరు శృంగారపురుషులే వున్నారే? వారిలోనూ ధూర్జటి కవిగా రంటే ప్రధానామాత్యులకు వల్లమాలిన పక్షపాతమే? వారే నన్నిలా అన్నా రంటే, వారి వుద్దేశం యేమయి వుంటుందీ?

ఇంతకీ, — సుధర్మను మించిన రాజసభ. పుంభావ సరస్వతి అయి, నవరసాలూ వొప్పిస్తూ అనుభవిస్తూనున్నూ వున్న ప్రభువు. ప్రజలు భాగ్యభోగ్యాలతో తులతూగుతూ వుండిన సమయం. సామ్రాజ్యం అంతా నిష్కంటకంగా వున్న సందర్భం. ఇలాంటప్పుడు శృంగారకవిత్వం కాక మరేమి కవిత్వం వస్తుందీ? దొంతరదొంతర్లుగా వుత్సాహతరంగాలు విరిగిపడుతున్న సమయాన కాకపోతే శృంగారకవిత్వానికీ, శృంగారరసానికీ విని యోగం యెప్పుడూ మరీ?

అసలు, కవిత్వం అంటేనే తమ తల కెక్కదుట. ప్రధానామాత్యు లెందుకో నన్ను విషమపరీక్ష చేస్తున్నట్టుంది. ఒక్క పద్యాలు కట్టడమే లేదుగాని — పెద్దన్నగారు మనుచరిత్ర విని

పించినప్పుడు వారు సారస్యాలమీద సారస్యాలు తియ్యడమూ, గుక్కతిరగనివ్వని పూర్వపక్షాలు చేసి మధ్యమధ్యకీ — చు మనిపించడమూ నే నెరగనూ? సకలకథాసారసంగ్రహంమీద వారు చేసిన పూర్వపక్షాలతో అయ్యలరాజువారు పాతాళా నికి కుంగిపోలేదూ, ఆవేళ? శ్లేష విషయమై వారు కొట్టిన దెబ్బ బట్టుమూర్తి యీజన్మలో మరిచిపోగలడా? అంత పక్షపాతం చూపిస్తూ వుండిన్నీ అప్పుడప్పుడు వారు ధూర్జటికవిగారిని కూడా గిలగిల్లాడిస్తూ వుండడం నే నెరగనూ? వారు సాహిత్య చక్రవర్తు లనడానికీ, మహామహోపాధ్యాయు లనడానికీ యి లాంటి నిదర్శనా లెన్ని లేవూ? ఆముక్తమాల్యద వినే సంద ర్భంలో, హేమాహేమీ లయిన పండితకవిసార్వభౌముల సమ క్షాన "తమ శౌర్య ప్రతాపాలు తమతోనే చెల్లు. తమ రసి కతావిలాసాలు తరవాతి తరంతోనే చెల్లు. తమ కవితావినో దాలూ, తమ ఆముక్తమాల్యదా మాత్రమే తరతరాలే కాక, యుగయుగాలు కూడా వుండిపోయి యేలిన వారికి నిత్యనూత్న మహోత్కృష్టమూర్తిమత్వం సంఘటిస్తూ వుంటా" యని ఢంకామీద దెబ్బకొట్టి చెప్పగలిగినవారికి కవిత్వం తల కెక్క డం లేదంటే నమ్మెయ్య వలసిందేనా?

పోనీ, నాకవిత్వం నీరసంగా వుందా? అయితే, ప్రభువు చేస్తూ వున్నది వ్యాజస్తుతి అనుకోవాలా? మరి పెద్దనగా రెందు కంత ప్రశంసిస్తున్నారూ? ధూర్జటికవిగా రెందుకంత పరవశు లవుతున్నారూ? మొన్న సాయంత్రం రెండుకాళ్లూ

పట్టుకుని దాసోహం అన్నాడే బట్టుమూర్తి? నిన్న పొద్దున్న మాదయగారి మల్లన్నగారు రెండు చేతులూ పట్టుకున్నారే, తాదాత్మ్యంతో? వర్ధమానచంద్రుడు పింగళి సూరన్న క్షణం విడిచిపెట్టలేకుండా వున్నాడే మరి?

ఇదంతా యేమిటి?

ఇందులో యేదో మర్మాఘాతం వుంది. తప్పకుండా వుంది, సందేహం లేదు. అమ్మాయిని చూసేసి, యింటికి వెళ్ళి అదేమిటో కనిపెట్టాలి. జన్మాని కల్లా శివరాత్రి అన్నట్టు ఇన్నాళ్ళకి నేను ప్రబంధరచన సాగించడమూ, ప్రభువు అత్యుల్లాసంతో వినడమూ, మహామహులంతా వోహో అంటూ ప్రశంసించడమూ, పౌరులు మురిసిపోతూ వుండడమూ - ఇలాంటి సమయాన, గభీమని యీ చలిపిడుగు పడ్డమూ—ఇదంతా యేమిటో ఆరాతియ్యాలి.

(దురుసుగా వెళ్ళిపోతాడు)

## రెండో రంగం

స్థలం —— తిరుమలదేవి నగరి ఆవరణ.

చీకటి పడుతూ పడుతూ వున్న సమయం. పక్షుల కిలకిలా రావాలు తగ్గాయి. ఆకాశాన నక్షత్రాలు మిలమిల్లాడుతున్నాయి.

నగరి దీపాలు, చెట్ల కొమ్మల్లోనూ తీగల్లోనూ వుండుండి తళుక్కుమంటున్నాయి.

ప్రహారీద్వారం యిక పది గజాలలో వుందనగా బాటకి యెడమగా పెద్ద అశోకవృక్షమూ, దాని చుట్టూ సొగసైన అరుగున్నూ.

రెడ్డికం వేసుకుని తిమ్మకవి ఆఅరుగుమీద కూచుని వున్నాడు.

తిరుమలదేవి దాది అయిన మంగ, రెండు గజాల్లో నుంచుని వుంది, ఎదట.

మధ్యమధ్య, ఆపనిమీదా యీపనిమీదా నగరిలో తిరుగుతూ వున్న పరిచారికల మాటలు సన్నసన్నంగా వినపడుతున్నాయి.

---

మంగ — అసలు, ఖండిత అంటేనే పురుషులు చెవికోసుకుంటారు. ఆఖండిత అయినా వారూ వీరూ కాదు, సత్యభామాదేవమ్మగారు. నాయకులా, జగజంత శ్రీకృష్ణులవారు. దీనికి సాయం, కథ నడపడం నారదమహర్షి, ఆకథ కట్టడం తమరూను. ఇక, ప్రభువు, పరమానందభరితులు కావడంలో వింత యేముంది బాబయ్యా?

తిమ్మకవి — అది సరే; కాని రెండు గడియల కిందట నావుత్సాహం అంతా విరిగిపోయింది. సాటి ఆస్థానకవుల మెప్పంతా పూర్వపక్షమున్నూ అయిపోయింది.

మంగ — (ఏమీ యెరగనట్టు) అదేం బాబయ్యా?

తిమ్మకవి — ఏమంటే యేమిచెప్పనూ? దాంతో నాతల దిమ్మెక్కిపోయింది. రేపు, రాజసభలో నేను కావ్యపఠనం చెయ్యగలుగుతా ననీ, ప్రభువుని ఆనందపెట్టగల ననీ నా కెంత మాత్రమూ తోచడం లేదు.

మంగ — ఇంతట్లో అంత పుట్టిమునక యేమి వచ్చిపడింది బాబయ్యా?

తిమ్మకవి—రాజకార్యాల్లో యేవో తిరుగుళ్లువచ్చాయిట. మహామంత్రులవారికి తలా తోకా బోధపడ్డం లేదుట. దారీ తెన్నూ కూడా కనపడ్డం లేదుట.

మంగ — అయ్యో!

తిమ్మకవి — వారు నాకవిత్వం వినిపించుకోడం లేదు. విధి లేక సభలో కూచుంటున్నారు, అంతే. వారి కీ ధ్యానమే లేదు.

మంగ — పెద్దచిక్కే.

తిమ్మకవి — చిక్కన్న చిక్కా? వారిని ఆకర్షించలేని కవిత్వం —

మంగ — అంత తికమక లేమి వచ్చాయి బాబయ్యా? ప్రభువు నిరుత్సాహంగా వున్నట్టయినా కనపడరే?

తిమ్మకవి — అది కూడా నన్ను గజిబిజి పరిచేస్తోంది. మహామంత్రిని చీకాకుపరిచే రాజకార్యాలు ప్రభువుని మాత్రం చీకాకుపరచవ్వూ?

మంగ — మన ప్రభువు రాజకార్యాలు మరిచి విలాసాల్లో మునిగిపోయేవారు కారుగదా బాబయ్యా?

తిమ్మకవి — అది నే నెరగనూ? అంచేతే నేను మరీ యిదయిపోతున్నాను.

మంగ — సరదార్లూ మండలేశ్వర్లూ, తక్కిన మంత్రులూ కూడా వుల్లాసంగానే వున్నారు గాని –

తిమ్మకవి — ఒక్కమహామంత్రిగారికే వచ్చినట్టుంది, ఆ చిక్కేమిటో?

మంగ — (మొగం పక్కకి తిప్పుకుని, తల పంకించుకుని, మళ్ళీ–) ప్రభువుకీ ప్రధానికీ పొరపొచ్చాలేమయినా –

తిమ్మకవి — రావడమే వస్తే అవి దేవుడికిన్నీ దుర్భేద్యాలే అవుతాయి.

మంగ — అదీ నిజమే. ఒకరికంటే వొకరు గంభీరులువారు.

తిమ్మకవి — అదలా వుంచు. ఇక యిక్కడి సంగతిచూడు. సభలో నేను కావ్యపఠనం చేసేటప్పుడు తెరవెనక వుండి అమ్మాయికూడా ఆలకిస్తూనే వున్నారు కదా, ప్రభువు ప్రశంసలున్నూ చూస్తూనే వున్నారు కదా, మరి, సభనుంచి వచ్చి నగరిలో రెండుగడియ లుండినా ఆవిషయమే మాట్టాడరేం, వొకనాడయినా?

మంగ — (మొగం వంచుకుని) తమరు దయచేస్తే పిచ్చాపాటీ చెప్పుకోడంతోనే సరిపోతోంది అమ్మాయికి.

తిమ్మకవి — అయితే నాకవిత్వం కంటే అదే యెక్కువా అమ్మాయికి?

మంగ — అదికాదు –

తిమ్మకవి — ఏదికా దంటావు? మహామంత్రుల వారికి రాజకార్యాలా? అమ్మాయికి పిచ్చాపాటీనా? నాకవిత్వం వో - ట్టి తుక్కన్న మాటా?

మంగ — (చేతులు పిసుక్కుంటూ) తమ రంతమాట సెల విప్పిస్తే నేనేం మనవిచేసుకోగలను బాబయ్యా?

తిమ్మకవి — నువ్వు మనవిచేసుకోవలసిన అగత్యం మాత్రం యేమిటి మంగా?

మంగ — (మొగం వంచుకుని వూరుకుంటుంది)

తిమ్మకవి — అమ్మాయి చురుకుదనం నే నెరగనిదా? ఇంత మందకొడిగా యెప్పు డయినా వున్నారా ఆమె?

మంగ — (మొగం వంచుకునే వుంటుంది)

తిమ్మకవి — అమ్మాయి సాహిత్యవేత్తృత తక్కువ దంటావా పోనీ?

మంగ — (మొగం వంచుకునే వుంటుంది)

తిమ్మకవి — ఒక్క పద్యం చదివితే చక్కగా సమన్వ యించి భావం అనేకవిధాల విస్తరిస్తారే అమ్మాయి? కవితా ప్రస్తావం వచ్చిం దంటే నిద్రాహారా లక్కరలేదే ఆమెకి?

మంగ — (తల పంకించుకుని) నిజమే.

తిమ్మకవి — అలాంటి విదుషీమణి యిప్పుడు నాతో తప్ప నిసరి అయి మాట్లాడుతున్నట్టు లేదూ? నన్ను తొరగా పంపెయ్యడానికే మాటలు తెమిల్చేస్తున్నట్టు లేదూ?

మంగ — (పక్కకిచూస్తూనిట్టూర్పువిడిచివూరుకుంటుంది)

తిమ్మకవి — మాట్లాడ వేమే మంగా? ఏదీ, యిలా చూడూ! నువ్వున్నూ యెందుకో ఆందోళపడుతున్నట్టు కన పడతావేం?

మంగ — నా ఆందోళన కేమి బాబయ్యా? అమ్మాయి స్థితి యేమీ బాగాలేదు.

తిమ్మకవి — (ఆదుర్దాపడుతూ) ఏమీ? ఏమి వచ్చిం దిప్పుడూ? అప్రియ వార్త లేమయినా వచ్చాయా యెక్కణ్ణుం చయినా? మనవూళ్ళో అంతా బాగా వున్నారా?

మంగ — అప్రియవార్తలూ లేవు, అంతటా అందరూ బాగానూ వున్నారు. కారణం మరెక్కణ్ణుంచో వూడిపడలేదు బాబయ్యా, యిక్కడే —

తిమ్మకవి — ఏమిటదీ? ఎందు కేర్పడిందీ?

మంగ — (మళ్ళీ మొగం పక్కకి తిప్పుకుని నిట్టూర్పు విడిచి వూరుకుంటుంది)

తిమ్మకవి — నీజాప్యం చూస్తే నామనస్సు చెదిరిపోతోంది, తెలుసా?

మంగ — నామనస్సుబాగాలేక నేను చెప్పలేకపోతున్నాను. తమరుగూడా నాలాగే అయిపోతే యింకెలాగా? అమ్మాయి విచారం పోగొట్టడానికి నేను చేసిన దంతా బూడిదలో పోసిన పన్నీ రయిపోయింది. ఇక తమరే దిక్కు. తమరున్నూ —

తిమ్మకవి — నేనే దిక్కా? అయితే, ఇప్పటిదాకా యెం దుకు చెప్పావు కావూ నాతో?

మంగ — గడియ కిందటే తేలిపోయింది నావల్ల యేమీ కాదని. రేపు పొద్దున్న వచ్చి సంగ తంతా తమతో మనవి చేసుకోవా లని —

తిమ్మకవి — మంచి ముహూర్తం కోసం—

మంగ — కాదు బాబయ్యా! నిజానికిది తమదాకా రావ లసిందా? అవతలి రాణు లేదో తంత్రం పన్నిన ట్టుంది, లేక పోతే నావల్ల కాకపోయే దేనా యిది?

తిమ్మకవి — ఎవ రా రాణులు?

మంగ — ఎదటపడ్డారా మరి, ఫలానా అనడానికి?

తిమ్మకవి — ఇప్పుడయినా—

మంగ — మనవి చేసుకుంటున్నా. వారం దినాల నుంచి ప్రభువు నగరికి రావడం లేదు.

తిమ్మకవి — (ఉద్విగ్నుడై) ఏమన్నావూ?

మంగ — వారందినాలనుంచి ప్రభువు నగరికి రావడంలేదు.

తిమ్మకవి — ఏమిటా గుండెనిబ్బరం?

మంగ — అమ్మాయి అనేక విన్నపాలు పంపుకున్నారు. నేను కాళ్లా వేళ్ళా పడ్డాను; కాని—

తిమ్మకవి — అంత గొడవ జరిగిందీ? అయితే కారణం?

మంగ — ఆభాస కాని కారణమా బాబయ్యా అదీ?

తిమ్మకవి — అమ్మాయిదగ్గిర నుంచోడానికి సత్తా చాలక తా మేమో ఆకాశంనుంచి వూడిపడ్డట్టు నటన.

మంగ — అదేమి పుణ్యమో, చిలవలూ పలవలూ —

తిమ్మకవి—అస లేమి జరిగిందే?

మంగ — జరగడాని కేమి వుంది బాబయ్యా? వడ్లగింజలో బియ్యపుగింజ.

తిమ్మకవి — నువ్వా నానిస్తే నేను సహించలేను, తెలుసా?

మంగ — వెళ్ళిపోయిన శుక్రవారం రాత్రి రాజమహేంద్రవరంనుంచి వచ్చినవేశ్య వీణ వాయించింది కాదూ?

తిమ్మకవి — అవునుట.

మంగ — ప్రభువు పరవశు లయిపోయారు, అది విని.

తిమ్మకవి — విన్నాను.

మంగ — వారిని తోడితెచ్చుకోడానికి వెళ్ళి నేనున్నూ బొమ్మనయిపోయాను.

తిమ్మకవి — సరే.

మంగ — ఈకారణంవల్ల ప్రభువు నగరికి వచ్చాటప్పటికి అర్ధరాత్రి దాటిపోయింది.

తిమ్మకవి — ఊహూ!

మంగ — ప్రభువు రాక అమ్మా మెరగరు.

తిమ్మకవి — అలా జరిగిందా?

మంగ — అంతవరకూ బాగానే జరిగింది, అదీ బాగానే జరిగింది బాబయ్యా, తరవాతే పుట్టి మునిగింది.

తిమ్మకవి — తొరగా చెప్పు, వివరంగా.

మంగ — భర్త వచ్చేదాకా నిద్ర ఆపుకోలేకపోతే కాళ్ళ దిక్కున శిరస్సుంచుకుని శయనించడం మామూలేగా స్త్రీలకు?

తిమ్మకవి — సరే.

మంగ — నేనమ్మాయిని లేపుదా మని చూశాను; గాని వద్దని వారించారు ప్రభువు.

తిమ్మకవి — ప్రత్యుత్థానం చెయ్యాలే దని —

మంగ — అదేమీ కాదు బాబయ్యా!

తిమ్మకవి — ఆభాస కాని కారణమే కాదన్నావు గదా ?

మంగ — నిజమే బాబయ్యా !

తిమ్మకవి — మరి నేను వినగూడనిదా అది ?

మంగ — అలాంటిదీ కాదు బాబయ్యా ! అస లది కారణం అయితేనా ?

తిమ్మకవి — నువ్వు డొంకతిరుగుడు మాన లేదు.

మంగ — లేదు లేదు, ప్రభువు సెలవు పొంది నే నివతలికి వచ్చేశాను.

తిమ్మకవి — సరే.

మంగ — ప్రభువున్నూ అమ్మాయిని లేపకుండా వొక పక్కగా శయనించారు.

తిమ్మకవి — ఏమన్నావూ ?

మంగ — అమ్మాయి కొంచెం గోడ దగ్గిరగా వున్నారు. ప్రభువు ముందువైపున —

తిమ్మకవి — అంటే —

మంగ — అంటే, ప్రభువు పాదాలు అమ్మాయి శిరస్సు కేసీ, అమ్మాయి పాదాలు ప్రభువు శిరస్సు కేసీ —

తిమ్మకవి — మొదటిది బాగానే వుంది. అమ్మాయి యెప్పుడూ ప్రభువు పాదాలు కొలుచుకుంటూనే వున్నారు.

మంగ — ఆవేళ అలా వచ్చింది కాని ప్రభువు మాత్రం అమ్మాయి పాదాలు —

తిమ్మకవి — అవునవునూ. అదీ జరుగుతూనే వుంటుంది లే.

మంగ — తాము మెళుకువగా వున్నారు కనక పభువు పుస్తకం లాగే పడుకున్నారు; కాని అమ్మాయి మాత్రం నిద్రావశాన వొత్తిగిల్లడంలో, పాదాలు ప్రభువు శిరస్సుకి —

తిమ్మకవి — తగిలాయా ?

మంగ — తామరతూళ్ళకంటే మెత్తని పాదాలు కదా —

తిమ్మకవి — అంత మాత్రానికేనా ఆగ్రహం ?

మంగ — అంతా యింతానా అది మరి ?

తిమ్మకవి — రణకర్కశమైన తమ వజ్రశిరస్సు తగిలి ఆ మెత్తని పాదాలు కందిపోయాయేమో ? సంవాహనం చెయ్యవలసిన విధి మరచిపోయి, పైగా, ఆగ్రపడ్డమా ?

మంగ — ఇంతకీ, — స్పర్శవల్ల మెళుకువ రాగా — జరిగిపోయిందిన్నీ స్ఫురణకు రాగా వెంటనే ప్రభువు పాదాలు పట్టుకున్నారు అమ్మాయి. ఎంతో పశ్చాత్తాపపడ్డారుకూడా; కాని—

తిమ్మకవి — వోస్ !

మంగ — వినిపించుకోలేదు. నుంచోలేదు కూడా.

తిమ్మకవి — (సామర్షంగా) ఓహో, ఇలాంటి పౌరుషం కూడా వుందా యీ ప్రభువుకి ?

మంగ — ఉన్న దంతా చూపించుకుంటున్నారు, ఉండ డంతో సరిపోయిందా ?

తిమ్మకవి — ఈభాగోతం అంతా ముందే యెందుకు చెప్పావు కాదూ నాకు ?

మంగ — ఇంత ముదురుతుం దని —

తిమ్మకవి — నువ్వే ముదరబెట్టావు, తెలుసా ?

మంగ — ప్రభువు సరసులు కదా —

తిమ్మకవి — ( వెటకారంగా ) ఇదిగో, యిదీ సారస్యం. అర్ధాంగిని ఆత్మవతుగా చూసుకోలేని ప్రాభవా లిలా వుంటాయి మరి.

మంగ — అంతఃపురాలలో —

తిమ్మకవి — అవునవును. అంతఃపురాల్లో కూడా సభా మర్యాదలు కావలసివచ్చాయి, ఈకన్నడరాయణింగారికి.

మంగ — విభ్రాంతివల్ల —

తిమ్మకవి — దానికి సమయాసమయాలూ, స్థలాస్థలాలూ వున్నాయి, మంగా !

మంగ — ( ఉలిక్కిపడి, చేతులు పిసుక్కుంటుంది )

తిమ్మకవి — అవతల యేరాణికో వశపడి యిక్కడ కారణ కల్పన !

మంగ — నాకూ అదే అనుమానం —

తిమ్మకవి — దక్షిణనాయకులకు దాక్షిణ్యం యేమిటి ?

మంగ — ( చూస్తూ వూరుకుంటుంది )

తిమ్మకవి — ఇలాంటిచోట ఖండితలకే మన్నన.

మంగ — ఎంత బతిమాలినా —

తిమ్మకవి — ఇలాంటి వ్యవహారాలు - బతిమాలిన కొద్దీ బిర్రబిగుస్తాయి.

మంగ — (చూస్తూ వూరుకుంటుంది)

తిమ్మకవి — అమ్మాయి అంత బేలపోవడం కూడా యేమీ బాగాలేదు. అది కూడా కొంత లోకు విచ్చింది.

మంగ — లోకువంటే —

తిమ్మకవి — లోకువంటే లోకువే. మరి, దానికి మూలం ? అరసికత అని గుర్తించుకోలేకా యీమిడిసిపాటు.

మంగ — ( చకిత అవుతుంది )

తిమ్మకవి — స్త్రీలు తమయెడల భయభక్తులు చూపించాలనే గాని, స్త్రీలయెడల తాము ఆదరాభిమానాలు కనబరచాలన్న జ్ఞానం వుండదు, చాలామంది పురుషులకు.

మంగ — అదిన్నీ —

తిమ్మకవి — ఒక రాజు బిడ్డని మరొక రాజు బిడ్డ చూడవలసిన పద్ధతి యిదేనా ?

మంగ — కూతుళ్ళ తండ్రులంటే యెవరికయినా లోకువే కదా బాబయ్యా ?

తిమ్మకవి — అలాగేం ? (తల యెగరవేసుకుంటూ) అయితే యిది యెంతవరకూ వెడుతుందో కాస్తయినా ఆలోచించుకున్నారా ఈరాయణింగారు ?

మంగ — తమరు —

తిమ్మకవి — అసలు, నే నిక్క డెందుకున్నానో అదయినా గుర్తించుకున్నారా, వారు ?

మంగ — లేదన్నమాటే.

తిమ్మకవి — నాబిడ్డకు తిరస్కారమూ నాకు సత్కారమూనా ?

మంగ — ప్రభువు, ఇంత స్వల్పాని కింత మంకుపట్టుపడతా రనుకోలేదు నేను. రెండు గడియల కిందట కసిన్ని పాలు తాగించడం బ్రహ్మాండం అయిపోయింది అమ్మాయిచేత. నాటి నుంచీ అమ్మాయి నిద్రాహారా లెరగరు.

తిమ్మకవి — అంటే, నాకావ్యపఠనమూ అమ్మాయి ఉపవాసదీక్షా యేకకాలాన ప్రారంభం అయినా యన్నమాట.

మంగ — (నసుకుతూ) చి—త్తం.

తిమ్మకవి — అమ్మాయి సభకే రావడం లేదు. (చురుగ్గా చూస్తూ) అవునా ?

మంగ — (చేతులు నలుపుకుంటూ) చిత్తం బాబయ్యా!

తిమ్మకవి — వ్యవహారం నువ్వు పొక్తుపరచలేకపోయావు, పోసి అంటే, నాకు తెలియపరచకుండా ముదరబెట్టావు.

మంగ — నాతప్పు తెలిసింది బాబయ్యా ! అయితే, యిది తమదాకా రావడం సిగ్గుచేటు అని భావించారు, అమ్మాయి.

తిమ్మకవి — (సాలోచనగా) అవు నదీ నిజమే. ఈజ్ఞానం రాయణింగారిక్కూడా వుండవలసింది. (తల పంకించుకుని)

అదలాజరిగిందా? ఇదిలా జరుగుతోందా? ఇదేమీ గుర్తించు కోకుండా కవిత్వంలో పడి తలమునక లవుతున్నానా నేను? అందు లోనూశృంగారకవిత్వమా? (చకితుడై) ఆ. అదీ సంగతి. బోధ పడుతోంది. బోధపడేపోయింది. ఎంతబుర్రచించుకున్నా ప్రధా నామాత్యులవారికి దారీతెన్నూ దొరకని రాజకార్యం యిదీ. ఎంత దెబ్బ కొట్టారూ వారు? ఎంత సాగతీసి కొట్టారూ? (జలదరించుకుని) శూలంవేసినట్టు గుచ్చుకుంటోం దామాట. (గుండెలు అదుముకుంటూ) హృదయం బద్దలయిపోతోంది. వొళ్లంతా కందిరీగలు కుట్టినట్టున్నూ అయిపోతోంది. నే నిక్కడెందు కున్నానూ? అస లెందుకు వచ్చానూ? నాకు మాత్రమే తెలియవలసిన అమ్మాయి అవస్థ తిమ్మరుసయ్య వారికి తెలిసింది, మొదట. నాకు కలగవలసిన ఆవేదన వారి క్కలిగింది. నాప్రభువుకి నే నేమి చెప్పగలనూ ఇందుకు? కవితావినోదాలలో మునిగి తేలుతూ వొళ్ళు తెలియని స్థితిలో వున్నానని తెలిస్తే నా ప్రభువు మన స్సెంతచివుక్కుమంటుందీ? రాజకార్యాలు నిర్వహించడంలో నేను తమతో సమానుణ్ణని ప్రభువుకి నచ్చజెప్పి నన్నిక్కడికి పంపేటట్టు చేసిన మహామంత్రి గారికి నే నెంత ద్రోహం చేశానూ? నన్ను అమ్మాయితో పంపుతూ "ఇక తల్లీ తండ్రీ మీరే" అన్నారు మహారాణీ వారు. నేనిక యేమొగం పెట్టుకుని వారి యెదట పడగలనూ?

సంగ — (వెఱ్ఱి పుట్టిందన్నట్టు తల పంకించుకుంటుంది)

తిమ్మకవి — రాయలవారు కనపరుస్తూ వున్న మెప్పంతా

వో—ట్టి బూటకం అన్నమాట. అది అమ్మాయిని మరింత పరాభవించడం అన్నమాట.

మంగ — చీకటిపడుతోంది బాబయ్యా!

తిమ్మకవి — పడనీ! ఇంకా పడనీ. నాహృదయం అంతా నిండిపోయింది అంధకారం. దానికంటే యెక్కువదా యిది? పైగా, ఝంఝామారుతమూ, దావానలమూ —

మంగ — అలాగ ఆవేశం తెచ్చుకున్నంటే యేమి లాభం బాబయ్యా?

తిమ్మకవి — నిజమే. (దృఢంగా) నిజమేనే. ఆవేశమే వచ్చింది నిజమే. కాని వచ్చినందుకు ఫలంగా విసురుదామంటే నేను పట్టింది కత్తి కాకపోయింది. (స్ఫురణ అభినయించి) ఏమిటీ? బాగుంది......మహాబాగుంది. పుణ్యకాలం కాస్తా దాటిపోకుండా బాగా స్ఫురించిం దిది. మంగా! బాబయ్య బతికే వున్నారని చెప్పు అమ్మాయితో.

మంగ — (తాపీగా) చిత్తం.

తిమ్మకవి — వెళ్ళు. నుంచోకు. ఇక వెళ్ళిపో.

మంగ — లోగిటిదాకా వస్తాను బాబయ్యా!

తిమ్మకవి — ఎందుకూ? చెప్పవలసింది —

మంగ — మరేమీ లేదు బాబయ్యా!

తిమ్మకవి — కనక, నగరికే వెళ్లు. వెళ్లి మళ్ళీ కాస్త ధారకం యిచ్చే ప్రయత్నంలో వుండు.

మంగ — మరి, మా కేమి సెలవు?

తిమ్మకవి — నిశ్చింతగా వుండండి. బింకంగా వుండండి. కాని, యెదురుచూస్తూ వుండండి.

మంగ — చిత్తం.

తిమ్మకవి — వ్యవహారం నాదాకా వచ్చాక కూడా ఆందోళన యెందుకూ? ఆకొన్న సింహాన్ని జూలుపట్టుకుని గుంజారు రాయణింగారు. దీనికి ప్రతిఫలం అనుభవిస్తారు. అయితే, రేపు. ఇవాళ సమయం మించిపోయింది మరి.

మంగ — అవునవును, తమకి దయవుంటే యిక రేపే.

తిమ్మకవి — రేపయినా యీపాటికి. (ఆలోచించి) ఇంతకంటే ముందే కావచ్చు, సందేహం మాత్రం లేదు.

మంగ — చిత్తం.

తిమ్మకవి — వెళ్లు మరి.

మంగ — (చేతులు దోయిలించుకుని) సెలవు — (బయలు దేరుతుంది)

తిమ్మకవి — చూడూ!

మంగ — చిత్తం. (వెనక్కి వస్తుంది)

తిమ్మకవి — ఇంతవరకూ ఏమి జరిగిందో జరిగింది. జరిగి పోయినదాని కుపవాసం అవసరమయితే అది వుండవచ్చు; కాని యిక ఆపద్ధతి పనికిరాదు. స్పష్టంగా ఆరగింపు చేయించు అమ్మాయికి.

మంగ — ప్రయత్నం చేస్తాను.

తిమ్మకవి — ప్రయత్నం చెయ్యడం కాదు, ఇది నా ఆజ్ఞ

అని చెప్పు అమ్మాయితో. రాయలవారి నిటు మళ్ళించా లంటే నగరిలో అమ్మా యెలా వున్నారో అన్న ఆందోళన వుండగూడదు నాకు, తెలుసా ?

మంగ — చిత్తంచిత్తం, బోధపడింది. తమఆజ్ఞ నెరవేరుతుంది.

తిమ్మకవి — ఆ, అదీ మాట.

మంగ — చిత్తం బాబయ్యా !

తిమ్మకవి — చూడూ,

మంగ — సెలవిప్పించండి.

తిమ్మకవి — అపరాధ మేమో, రాయణింగారిది.

మంగ — చిత్తం.

తిమ్మకవి — మరి అమ్మాయిది ?

మంగ — సెలవిప్పించండి.

తిమ్మకవి — అనుగ్రహించవలసిన పెత్తనం. . ( అవునా అన్నట్టు తేరిచూస్తాడు. )

మంగ — తెలిసిపోయింది బాబయ్యా !

తిమ్మకవి — ఇక వెళ్లు.

మంగ — చిత్తం బాబయ్యా, సెలవు. ( వంగి నేల అంటి కళ్ళకద్దుకుని వెళ్ళిపోతుంది )

తిమ్మకవి — ( అటూ యిటూ పచారుచేస్తూ ) మూంచి సమయాన గుండెల్లో పొడిచి మేలుకొలిపారు తిమ్మరుసయ్యవారు. తలుచుకుంటే సిగ్గుసిగ్గు. జాంబూనదాంబరాభరణాలు! గజారోహణం ! అగ్రహారాలు ! ధిక్, అంతా స్వార్థం. గడిపిన

వయస్సు, చదివిన చదువు, ఆర్జించిన జ్ఞానం, గడించుకున్న అనుభవం — అంతా పురుగుముట్టుకుపోయింది. విశ్వశ్రేయస్కరమైన కవిత్వం నరస్తుతిలో కలుషితం చెయ్యడమే కాకుండా, నా ప్రభువు నియోగం మరిచిపోయి — నిజమే! మరిచిపోయాను; కాని మించిపోలేదు. విలంబం అయిందే గాని విఘాతం కలగలేదు. పైగా, శృంగారకవిత్వమేయిప్పుడు కార్యసాధకం అవుతుంది. ఏమిాకాక? అక్కడా యిక్కడా కూడా నడుస్తూవున్నది ప్రణయకలహమే, శృంగారరసానికి తప్ప మరోరసానికి తావేదీ? మళ్ళీ రేపు కదా, సభలో కావ్యపఠనం? కనక, యీసందుబాట్లో, యీరాత్రి కథ (సాలోచనగా) ఇలా తిప్పేద్దాం. కల్పన - యిలా సాగిద్దాం. ధోరణి-ఇలా మళ్ళిద్దాం. మహా బాగా కుదిరింది పదకం. ఆయావేశానికీ ఆవేశం తోడయింది కనక, భోజనం కానిచ్చుకుని, తాంబూలం సేవించుకుంటూ మల్లికానికుంజంలో కూచున్నామంటే, వాటంతట అవే స్వయం వ్యక్తాలయిపోతాయి పద్యరత్నాలు. ములుకులతో గుచ్చినట్టూ, ఈటెలతో పొడిచినట్టూ, కటార్లతో చించి చెండాడినట్టూ వాటితో రేపు రాయణింగారిని చీకాకు పరిచేద్దాం. దాంతో వారు దారికి వచ్చితీరాలి. రారూ! మనది కవిత్వమే కాదన్నమాట. మనం బతికివుండినా వొకటే లేకపోయినా వొకటే అన్నమాట. (అహమికతో) అన్నా, మనం వుండగా రాయణింగారి కింత ఆగడమా?

(పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోతాడు.

## మూడో రంగం

కృష్ణదేవరాయడు భువనవిజయంలో కొలువు తీరివున్నాడు.

అప్పటికి జాముపొద్దుంది.

శ్వేతచ్ఛత్రం మొదలైన రాజలాంఛనాలు పట్టుకుని నలుగురైదుగురు యువతులు రాయణింగారి వెనక నుంచుని వున్నారు. ఇరుపక్కలా వుండి యిద్దరు యువతులు వింజామరలు వీస్తున్నారు.

ఎడమపక్కగా వున్న పట్టుతెరలో తిరుమలదేవి తప్ప తక్కిన రాణులూ, సామంత మండలేశ్వరుల దేవేరులూ, పెద్ద పెద్ద రాజపురుషుల భార్యలూ, రాజబంధువుల భార్యలూ వున్నారు.

పరిచారికల వరసలో వొక కొసగా మంగ కూడా వుంది.

నిలువెడెత్తున వున్న సింహాసనానికి ముందు, తిమ్మరుసయ్య తమ్ముడూ నగరాధ్యక్షుడూ అయిన గోవిందరాజూ, అల్లుడూ సేనాధ్యక్షుడూ అయిన నాదిండ్ల అప్పన్నా ముకుందగిరి బల్లేలు పట్టుకుని చెరోవైపునా నుంచుని వున్నారు.

రాయనికి కుడివైపున అల్లసాని పెద్దన్నా, ధూర్జటీ, మాదయగారి మల్లన్నా అయ్యలరాజు రామభద్రుడూ మొదలైన అష్టదిగ్గజాలలో యేడుగురున్నూ కూచుని వున్నారు. ఎడమదిక్కున తిమ్మరుసయ్యా, సామంతమండలేశ్వరులు కొందరూ, రాజబంధువులు కొందరున్నూ కూచునివున్నారు.

అష్టదిగ్గజాలకు వెనకగా, భట్టుమూర్తీ పింగళి సూరన్నా వర్ధమానచంద్రు లైన మరికొందరు కవులూ, తిమ్మరుసయ్య మొదలైనవారి వెనక సామంతులూ ప్రముఖపౌరులూ, సేనాధిపతులూ వున్నారు.

ఎడటా పక్కలా గోడలకు చేరికగా, పౌరులు చేతులు కట్టుకునీ, తలలు వంచుకునీ నుంచుని వున్నారు.

సింహాసనం ముందు, నాలుగ్గజాలలో ఎత్తయిన వేదిక మీద రాయని కభిముఖంగా తిమ్మకవి కూచుని వున్నాడు.

సభ అంతటా కౌశేయాంబరాల జిగజిగలూ, రత్నాభరణాల ధగధగలూ, నిశితాయుధాల చకచకలూ, రకరకాల అత్తరుల భుగభుగలూ వుత్సాహోల్లాసాలు రెచ్చగొడుతున్నాయి.

స్తోత్రపాఠాలు చేసి మందిమాగధు లప్పుడే వోసరిల్లారు.

మహామంత్రి యింగితం కనిపెట్టి ముక్కుతిమ్మకవి కావ్యపఠనం ప్రారంభించాడు. అతని మొగాన కనీ దీక్షా గంభీర ముద్ర తాల్చి వున్నాయి.

---

తిమ్మకవి —

క॥ ఈపగిదిన్ సాత్రాజితి
కోపోద్వేగమున వగల గుందుచు ఘనసం
తాపంబు పేర్మి నితర
వ్యాపారము మానియుండె — హరియును నచటన్॥

మ॥ ముని నా కిచ్చిన పూవుచందమును, నేమున్నాడి యా
భోజనం। దన కర్పించిన జాడయుం దెలియ జెంతన్
బొంచి వీక్షించిపో। యిన సాత్రాజితి బోటి నావలన దా
నేమేమి కల్పించెనో। యని ప్రద్యుమ్నని మానిదండనిడీ
చింతాయత్త చిత్తంబుతోన్॥

కృష్ణరాయడు — (తిమ్మకవితో) చింత యేలా శ్రీకృష్ణుల వారికి ?

తిమ్మకవి — తాము చేసింది అలాంటిది కనక.

కృష్ణరాయడు — (ధూర్జటికేసి చూస్తాడు)

ధూర్జటి — నామనవి యేమిటంటే ?

కృష్ణరాయడు — సెల విప్పించండి.

ధూర్జటి — నిన్న సాయంత్రం తిమ్మకవిగారిమీద నాకు చాలా కోపం వచ్చింది ; కాని అది పోయి, ఇవాళ, అంతకి మించిన మెప్పు కలిగింది మహాప్రభూ !

కృష్ణరాయడు — ఎందువల్లనో ?

ధూర్జటి — నిన్న సాయంత్రం తిమ్మకవిగారు, మసకపు పాముకాటు వంటి మాత్సర్యం ఆరోపించి సత్యభామాదేవమ్మ గారిని మదహస్తి హస్తగతపద్మంచేసి నలిపివేశారు. బంతిభేదం లేకుండా వాట, ఇవాళ, గాఢమైన చింత ఆరోపించి శ్రీకృష్ణుల వారినిన్నీ ఉక్కిరిబిక్కిరి కలిగించివిడిచిపెట్టారు. కనక, కోపం అంచేతా, మెప్పు ఇంచేతాను మహాప్రభూ !

కృష్ణరాయడు — (తిమ్మనసుతో) అప్పాజీ !

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారిలో తిమ్మకవిగారిలాంటి పరిణతి చూపిస్తారా చూపించరా అని నిన్నటినుంచీ నాకాందోళనగా వుంది మహాప్రభూ! దీంతో నాకు బాగా తృప్తికలిగింది.

కృష్ణరాయడు — (చకితుడై) అదేమిటీ?

తిమ్మరుసయ్య — మనవిచేసుకుంటాను మహాప్రభూ! సత్యభామాదేవిగా రిప్పుడు రోషకషాయితచిత్త లయి వున్నారు.

కృష్ణరాయడు — అవును.

తిమ్మరుసయ్య — ఆకారణంవల్ల వారిప్పుడు మిక్కిలీ దురుసుగా మాట్లాడితే మాట్లాడవచ్చు.

కృష్ణరాయడు — అయితే?

తిమ్మరుసయ్య — తమ నిర్దోషిత్వం పురస్కరించుకుని శ్రీకృష్ణులవా రందు కొక్కనిస్తే ?

కృష్ణరాయడు — (ఏమిటిదీ అన్నట్టు ఆలోచిస్తూ పెద్దన్నకేసి చూస్తాడు.)

పెద్దన్న — (రాయనితో) మహామంత్రులవారిది సరసమైన ప్రశ్నే మహాప్రభూ! ఏమంటే? శ్రీకృష్ణులవారిది యెంత నిర్దోషిత్వమో సత్యభామాదేవమ్మగారిదీ అంత నిర్దోషిత్వమే, మరి.

కృష్ణరాయడు — (గంభీరంగా చూస్తూ తల పంకించుకుంటాడు)

పెద్దన్న — (తిమ్మరుసుతో) తమరు సెల విప్పించినట్టు శ్రీకృష్ణులవా రిప్పుడు కినిస్తే —

తిమ్మరుసయ్య — సెలవిప్పించండి.

పెద్దన్న — (చేతులు తేలవేసుకుంటూ) రసాభాస అయి పోతుంది.

తిమ్మరుసయ్య — కనక, అలా కాకుండా వుండడానికి తిమ్మకవిగారు శ్రీకృష్ణులవారిని చింతాయత్తులను చేసి మరీ తీసుకువచ్చారు. అందువల్ల వారు కినియడం సంభవించదు. బుజ్జగించడమే జరుగుతుంది. (రాయనితో) ఇక్కడ తిమ్మకవి గారు ఈవిధంగా అనితరదుర్లభమైన ఉపజ్ఞ కనపరిచారు మహాప్రభూ!

(తిమ్మకవి సుతారంగా తల పంకించుకుంటాడు.
పెద్దన్నా ధూర్జటీ గంభీరంగా చూసుకుంటారు)

కృష్ణరాయడు — (కళ్లు మూసుకుని వొక్కమాటు ఆలోచించి తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ!

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచలమైన తాల్మితో,
దురగజవంబు మున్గడవద్రోచి కడంగెడు తత్తరంబుతో,
దిరిగెడు బండికండ్ల పగిదిన్భ్రమియించు మనంబుతోడ నా
హరి సనుదెంచె సత్య సముదంచిత కాంచనసౌధవీథికిన్ ”

కృష్ణరాయడు — (తిమ్మకవితో) సెబాస్! అది మళ్ళీ వొకమాటు సెలవిప్పించండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ! (అరదము నెక్కి అన్న పద్యం మళ్ళీ చదువుతాడు)

కృష్ణరాయడు — ఆంధ్రకవితా పితామహులు చిత్తగించారా ఆపద్యం ?

పెద్దన్న — చిత్తం చాలా చక్కని కల్పన. శ్రీకృష్ణులవారి ఆంతర ప్రవృత్తి బహిరంగంగా కనపరిచారు తిమ్మకవిగారు.

కృష్ణరాయడు — (ధూర్జటికేసి చూస్తాడు)

ధూర్జటి — ఆంధ్రకవితా పితామహులు మిక్కిలీ లెస్సగా సెలవిప్పించారు మహాప్రభూ ! ఆంధ్రవాఙ్మయాని కంతకీ అపరూపమైన పద్యం అది.

తిమ్మరుసయ్య — ఇంకో విశేషం కూడా వుంది మహాప్రభూ, ఇక్కడ.

కృష్ణరాయడు — ఏమి టదీ ?

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారి ప్రతిభాప్రాగల్భ్యాలకు నికషాయమానమైన ఘట్టం యిది. కనక, వారిప్పుడు జటిలమైన వ్యూహం పన్నుకోనిదే సత్యభామాదేవమ్మగారి యెదట పడ్డం మంచిది కాదు.

కృష్ణరాయడు — ( తల పంకించుకుని వూరుకుంటాడు )

తిమ్మరుసయ్య — జటిల మైన కల్పన జరగా లంటే దానికి పూర్వరంగం గాఢసంతాపం తప్ప మరోటి కా దిక్కడ.

కృష్ణరాయడు — అయితే ?

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారి ఆంతరప్రవృత్తి అందుకనుగుణంగా వుండడానికే తిమ్మకవిగారి యీకల్పనమహాప్రభూ

పెద్దన్న — మంచి వ్యాఖ్యానం.

ధూర్జటి — "నా మూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే" అన్న మల్లినాథమహామహోపాధ్యాయుల శోపథాని కనుగుణ మైన వివరణ మహాప్రభూ, మహామంత్రుల వారిది.

కృష్ణరాయడు — (ధూర్జటితో) చాలా చక్కగా సెల విప్పించారు తమరు. (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ!

గీ. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ
దారుకుని నుండ నియమించి, తాన యొకడు
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలము లేని నగరెల్ల నరసిచూచి

సీ. కనకపంజరశారికలకు జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు?
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు?
క్రొవ్వాడిగోళ్ళ దంత్రులు మీటి వీణియ
ల్వాలికింప రేలొకో భామ లిపుడు?
కలికి రాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడతు లిపుడు?

గీ. ఇన్ని దినములవలె నుండ దేమి నేడు
చిన్నబోయిన దీమేడ చెన్నుదరిగి,

పద్మముఖితోడ నెవ్వరే పారిజాత
పుష్పవృత్తాంత మెరిగింపబోలు నొక్కొ?
క. అని యనుమానించుచు నొ
య్యన ——

కృష్ణరాయడు —— శ్రీకృష్ణులవారి కీయనుమాన మిదివరకే కలిగియుండినది కాదూ?

తి[illegible] —— [illegible] [illegible]హాప్రభూ. [illegible] యిక్కడ స్థిరపడింది.

కృష్ణరాయడు —— (పెద్దన్న కేసి చూస్తాడు)

పెద్దన్న —— తిమ్మకవిగారు సెల విప్పించింది బాగుంది మహాప్రభూ! ఎంచేతనంటే? రుక్మిణీదేవమ్మగారి నగరిలో వున్నప్పుడు శ్రీకృష్ణులవారి క్కలిగిన అనుమానం వూహా మాత్రమే. సత్యభామా దేవమ్మగారి నగరికి వచ్చాక స్థితి గతులు పరిశీలించగా కలిగిన అనుమానం నిశ్చిత మైనది. ఈ రెండు అనుమానాలకూ అంతరం యిదీ రాజదేవేంద్రా!

కృష్ణరాయడు —— ధూర్జటి కవిగారూ!

ధూర్జటి —— వింటున్నాను రాజాధిరాజా! పెద్దన్నగారి వివరణ సరసంగా వుంది. కాక, — కొంచెం ముందుకి వెడితే ఆవిషయం స్పష్టపడుతుం దని భావిస్తాను.

(రాయని కేసి తిమ్మరుసయ్యా, తిమ్మరుసయ్య కేసి రాయడూ సాకూతంగా చూసుకుంటారు)

తిమ్మరుసయ్య —— (రాయనితో) సలహా బాగుంది, మహా ప్రభూ!

కృష్ణరాయడు — (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం చిత్తం!

క. అని యనుమానించుచు నా
 య్యన కోపగృహంబు సేరి యాసత్రాజి
 త్తనయ ముసుం గిడి యుండగ
 ననువు మెరయ జొచ్చి మాయ యచ్చుపడంగన్.

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్యతో) సత్యభామాదేవమ్మ వా రిప్పుడు కోప గృహంలో వుండినట్టు శ్రీకృష్ణులవారి కేమి యెరుక ?

తిమ్మరుసయ్య — మంచి ప్రశ్న మహాప్రభూ! (తిమ్మకవి కేసి చూస్తాడు)

తిమ్మకవి — (రాయనితో) సత్యభామాదేవమ్మగారి సాహచర్యంవల్ల శ్రీకృష్ణులవారి కది నిత్యానుభూతి గల విష యంమహాప్రభూ! (తిమ్మరుసయ్యతో) కాక, — అలాంటి యెరుకలేనిచోట దక్షిణనాయకత్వం హాస్యాస్పదం అయిపో తుందిగదా?

తిమ్మరుసయ్య — (తిమ్మకవితో) చక్కనియుక్తి. చాలా బాగుంది. సరిగా అతికింది. (రాయనితో) కవిహృదయం —

కృష్ణరాయడు — మిక్కిలీ గంభీరమూ, స్పందనం బహూ లలితమున్నూ. (ధూర్జటికేసి చూస్తాడు)

ధూర్జటి — చిత్తం, యేలినవారు సరిగా సెలవిప్పించారు. ఏమంటే? సత్యభామాదేవమ్మగారి ప్రవృత్తి గ్రహించే శక్తి

శ్రీకృష్ణులవారికే వుంది. ఆ శ్రీకృష్ణులవారి ఆంతర్యం తెలుసు కోగల సత్తా మన తిమ్మకవిగారికే వుంది.

మల్లన్న — ధూర్జటికవిగారు సెలవిప్పించింది అప్రతిహత మైన సత్యం మహాప్రభూ !

కృష్ణరాయుడు — ( మల్లన్న కేసి చూస్తాడు )

మల్లన్న — మనవి చేసుకుంటాను మహాప్రభూ ! శ్రీకృష్ణ లీల లంటే ప్రీతి లేనివారు జగత్తులో లేరు. అస్మదాదులం అవి తరుచుగానున్నా మననం చేసుకుంటూనే వుంటాం. మా కందరికీ గ్రంథకర్తృత్వమున్నా సిద్ధించే వుంది. మరి, శ్రీకృష్ణ లీలలు కథావస్తువుగా మే మెందుకు స్వీకరించలేదూ ? ఇందరి లోనూ వొక్క తిమ్మకవిగారే యెందుకు స్వీకరించారూ ? అంటే, మేము శ్రీకృష్ణలీలలకు ముగ్ధులం కాగలమే గాని అవి వర్ణించలేము. తిమ్మకవిగారు మాకంటే యెక్కువగా ముగ్ధులూ కాగలరు, వర్ణించాగలరు. దాని క్కారణం శ్రీకృష్ణులవారి ఆంతర్యం వారికి కరతలామలకం అయివుండడమే అనాలి.

కృష్ణరాయుడు — బాగుంది. ( తిమ్మకవితో ) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం రాజాధిరాజా !

ఉ. కొందర మంతనంబులను గొందర జంకెనవాడిచూపులన్
గొందర జేతిసన్నల దగుల్పడజేయుచు జేరబోయి మ
ధ్యందినభానుమండలకరావళి హావళి వాడియున్న తీ
గం దలపించు నమ్మగువ గన్గొని యెంతయువిస్మితాత్మయై.

ఉ. ఈలలితాంగిచంద మొకయించుకచూచెదనంచు ధూర్తగో
పాలుడు తాలవృంత మొక భామిని సత్య పిరుంద నుండి
మందాలసలీలమై విసర నాదట గైకొని వీచె, దద్వపుః
కీలితపంచసాయకశిఖిన్ దరికొల్పుచునున్న కైవడిన్.

కృష్ణరాయడు — బాగుంది. అది మళ్ళీ వొకమాటు సెలవిప్పించండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ! (ఈలలితాంగిచందం—చదువుతాడు)

కృష్ణరాయడు — చక్కని చిత్రణం. ఏమి అప్పాజీ?

తిమ్మరుసయ్య — తిమ్మకవిగారు ఉన్నదున్నట్టు చిత్రించారు. ఇక్కడ నాకు కనిపించిన విశేషం అంతే మహాప్రభూ!

కృష్ణరాయడు — అంటే?

తిమ్మరుసయ్య — దక్షిణనాయకుల దినచర్య అలాంటిది. తిమ్మకవిగారు అది బాగా గుర్తించారు. కనక శ్రీకృష్ణుల వారిని స్వస్వరూపంతో సాక్షాత్కరింపచేశారు. నావుద్దేశం యిదీ, జగత్ప్రభూ!

కృష్ణరాయడు — (చకితుడవుతాడు)

తిమ్మకవి — (రాయణ్ణిచూసి తల పంకించుకుంటాడు)

పెద్దన్న — నే నొక్క సంగతి విన్నవించుకుంటాను, జగత్ప్రభూ!

కృష్ణరాయడు — చిత్తం చిత్తం, సెలవిప్పించండి.

పెద్దన్న — శ్రీకృష్ణులవారు పరిచారిక చేతి వీవన పుచ్చు

కుని సత్యభామాదేవమ్మగారిని సేవించుకోడం దక్షిణనాయ కత్వానికి ఉచితంగానే వుంది. అయితే, తిమ్మకవిగారు అంత మాత్రమే చెప్పి వూరుకోక, శ్రీకృష్ణులవారు అలా వీచడం, సత్యభామాదేవమ్మగారి శరీరం అంతటా జాజ్వల్యమానం అవుతూవున్న మదనాగ్నిని మరీ రగుల్కొలుపుతున్నట్టుం దని ఉత్ప్రేక్షించారు. ఇది యెందుకో జటిలమైన సూచన; గాని మరేమీ కాదు.

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్యకేసి చూస్తాడు)

తిమ్మరుసయ్య — ఆంధ్రకవితా పితామహులు సెలవిప్పించింది విషయాంతరం. అయితే, తిమ్మకవిగా రది యెలా పర్యవసింపజేశారో గమనించ వలసివుంది మహాప్రభూ!

కృష్ణరాయడు — అంటే, జటిలమైన ఆసూచన పురస్కరించుకుని తమ రంతకంటే జటిలమైన వాగ్వాదానికి విఘ్నేశ్వరపూజ చేయించా రన్నమాట.

తిమ్మరుసయ్య — ఎంతమాటా రాజదేవేంద్రా? నా ప్రయత్నం యిక్కడ నేను నిరీక్షిస్తున్నా నని మనవిచేసుకోడం మాత్రమే. ఎంచేతనంటే? మహాకవులతో వాగ్వాదం సాగించడానికి నేను సుతరామూ తగను. నేనందుకు సిద్ధపడ్డం వారిని న్యూనతపరచడం కూడా కావచ్చు. కాక, — సహతీ సౌభాగ్యానికి అసూయపడే విలాసవతులను సాంత్వనపరచడానికి అనేక మార్గాలుండగా, మన తిమ్మకవిగారు, ఇక్కడ, శ్రీకృష్ణుల వారు సత్యభామాదేవమ్మగారికి మదనదశల నుద్దీపింపజెయ్య

బూనుకున్నట్టు చిత్రించారు. ఇది సామాన్యుల కంటే కల్పన కాదు. ఈసంగతి మనవిచేసుకోవడమే యిక్కడ నా వుద్దేశం. ఏమయినా — పుంభావసరస్వతులైన మహమ్మేలినవారి సముఖాన తటస్థించిన అవకాశం జారవిడుచుకోడం మంచిది కాదు. అదిన్నీ కాక :— నేను సాహిత్యవ్యాసంగిని కాకపోతే నక, యిందులో వోటమి సంభవించినా నాకు వచ్చే యిబ్బంది యేమీ లేదు, రాజాధిరాజా!

పెద్దన్న — మహామంత్రులవారు సెలవిప్పించినా అది సూయెడల వారికి గల పరమాదరభావానికి చిహ్నం. కాక, నిజం చెప్పుకోవలసి వస్తే, కవుల మని మాకు పేరే గాని సాహిత్యవిద్యలో వారికి శిష్యప్రాయులమే. కనక, యేలిన వారికి వినోదంగా వుంటుం దంటే యుక్తసమయాన కొంచెమో గొప్పో అది సాగించనేవచ్చు మహాప్రభూ!

కృష్ణరాయడు — (తిమ్మకవికేసి చూస్తూ) చిలికిచిలికి గాలివాన అయేటట్టుంది, చివరికి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ, కావడమే మంచిది. ఏమంటే? పెద్దలతో వాగ్వాదం యెంతో అదృష్టం వుంటే గాని లభ్యం కాదు. అందులోనూ, యేలినవారి సన్నిధిలో అది సంభవించడం మరీ విశేషం. కనక, నేను సావధానుణ్ణే విద్యాలభోజా!

కృష్ణరాయడు — ధూర్జటికవిగారూ!

ధూర్జటి — జటి లేనిదే జటిలత కవకాశం —

తిమ్మరుసయ్య — సెబాస్ !

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్యతో) బహూ రసవంత మైన మాట. (ధూర్జటితో) ప్రకరణానురోధంతో జటి మాటల్లో సుధామధురధారలు స్ఫురించడం ధర్మమే కదా ?

(పెద్దన్న చమత్కృతుం డవుతాడు. ధూర్జటి మంద హాసం చేస్తాడు. తిమ్మరుసయ్య తలవూపుకుంటాడు.)

కృష్ణరాయడు — (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ !

ఉ. అంతట పారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్
వింతలుసేయ దావి యదివిస్మయమంచుముసుంగుద్రోచి య
క్కాంత గృహంబునల్లడలు నారసి, సంభృతతాలవృంతునిన్
గాంతుని జూచి బాష్పకణికాతరళీకృతలోచనాంతయై.

కృష్ణరాయడు — ఓః !

తిమ్మకవి —

ఉ. ఓర్పొకయింతలేని వికచోత్పలలోచన చిత్తవీధి జ
ల్లార్పగ నీలనీరదశుభాంగుడు వే సనుదెంచె నంచు గం
దర్పహుతాశను ల్వెలికి దార్చు సఖుండును బోలె వేడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై.

కృష్ణరాయడు — భేష్ ! అనన్యసామాన్య మైన కల్పన !

( తిమ్మరుసయ్య కేసి చూస్తాడు )

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారి నీరదనీలత్వం బహూ చక్కగా పరిపుష్టం అయింది మహాప్రభూ !

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్యతో) బాగుంది. (తిమ్మ కవితో) సెలవిప్పించండి.

తిమ్మకవి — చిత్తం రాజాధిరాజా!

చ. వనిత కుచద్వయంబు పయి వ్రాసిన కుంకుమపత్రభంగముల్
జనితనితాంతఘర్మకణజాలముచేత గరంగి మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెద కెలంకుల జారుట యొప్పె, మానసం
బున నెలకొన్న క్రోధరసమున్ వడబెట్టుచునున్న కైవడిన్.

కృష్ణరాయడు — ఓహో! ఓహో! (తిమ్మకవితో) అది యింకోమాటు సెలవిప్పించండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ! (వనిత కుచద్వయంబు పయి — చదువుతాడు)

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్య కేసి చూస్తాడు)

తిమ్మరుసయ్య — మంచికల్పన మహాప్రభూ! చిత్రం పూర్తిగా సజీవం అయిం దిప్పుడు. (పెద్దన్న కేసి చూస్తాడు)

పెద్దన్న — (తిమ్మరుసయ్యతో) సందేహ మేమిా? (రాయనితో) భావుకతకు పరమావధి మహాప్రభూ యిది? (ధూర్జటి కేసి చూస్తాడు)

ధూర్జటి — (పెద్దన్నతో) అది తమరు నిర్ధారణ చెయ్యతగ్గ విషయం. (రాయనితో) సత్యభామాదేవమ్మగారి ఆగ్రహానికిన్నీ పరమావధే మహాప్రభూ, యిది.

కృష్ణరాయడు — కనపడుతూనే వుంది. (తిమ్మకవితో) తమరు కానివ్వండి!

తిమ్మకవి — చిత్తం చిత్తం!

క. మానవతి యిట్లు మానని
మానక్రోధములతో గుమారిలి చింతా
ధీనగతి నుండ, మదిలో
నూనిన ప్రేమమున నంబుజోదరు డనియెన్ ”

కృష్ణరాయడు — అప్పాజీ! శ్రీకృష్ణుల వారి పూనిక చిత్తగించారా?

తిమ్మరుసయ్య — చిత్తం, వారు చింతాయత్తులై దయ చేసినవారు కదా మహాప్రభూ?

కృష్ణరాయడు — అవునవును, ఆచింత కిక్కడా సమన్వయం. ఉచితంగాఉంది. (ధూర్జటికేసి చూస్తాడు)

ధూర్జటి — చింతకు పర్యవసానం జాలి. జాలికి పరిణామం ప్రేమ. ఈదశాక్రమం బహూ చక్కగా చూపించారు మహాప్రభూ. తిమ్మకవిగారు.

కృష్ణరాయడు — మరి తమ వ్యాఖ్యానం?

తిమ్మరుసయ్య — ఒక్కమనవి.

కృష్ణరాయడు — సెలవిప్పించండి.

తిమ్మరుసయ్య — ఔచిత్యం తప్పని దక్షిణనాయకత్వం శ్రీకృష్ణులవారిది. వారి ఔచిత్యం చక్కగా పోషించారు తిమ్మకవిగారు. తిమ్మకవిగారి ఔచిత్య విచారపద్ధతి బహూ సమర్థంగా చర్చించారు ధూర్జటికవిగారు. ఈచర్చ మమ్మేలినవారి సన్నిధిని ప్రసక్తం కావడంలో ఎంతో ఔచిత్యం వుంది.

పెద్దన్న — చివరికి మల్లినాథుల వారి సంజీవని అయింది మహాప్రభూ, మహామంత్రులవారి వివరణ.

కృష్ణరాయడు — సందేహ మేమీ ? (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం రసికచక్రవర్తీ !

ఉ. ఇందునిభాస్య ! మైతొడవు లేల ధరింపవు ? నున్నగావు లీ
వెందును మానలేవు, తెలుపేటికి గట్టితి ? వీటికారుచుల్
కెందలిరాకు మోవి దులకింపగజేయకయున్కి యేమి ? నీ
చందము వింత యయ్యెడు నిజంబుగ నాకెరుగంగ జెప్పవే !

చ. మన మరయం దలంచి యొకమార్గము వన్నితొ ? నవ్వు
టాలకొ ? । నను వెరపించెదో యకట, నాయెడ నిక్కము
తప్పుగల్గెనో ? । వనజదళాయతాక్షి ! పగవాడనె నన్నిటు
లేలచూడ ? వో । క్కనిమిష మైన నీవు దయ గన్గొన
కుండిన నిల్వనేర్తునే ?

చ. పలుకుల దేనె లుట్టిపడ బల్కవు నేడిది యేమి వాలుగ
న్నుల నునుసిగ్గు నూల్కొన గనుంగొనవేల ? యురస్థలంబు ॥
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌగిట జేర్ప వేటికే
చిలుకలకొల్కి ? యెవ్వరెడ సేసిరి నీకిటు లేల చింతలన్ !

చ. మనముల, మాటలం, గ్రియల మన్ననలీ నొకనాడు నెట్టి కా
మినులకు, గారవంబు మెరమెచ్చులకై పచరింతుఁగాని ; పా
యని యనురక్తి నీయెడనె యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచిన పంపు సేయుటయె ప్రాభవ మాటది నీ వెరుంగవే ?

మ॥ పడతీ ! నీమధురాధ రామృతము నీ బాహాపరీరంభముం
బడయం ధన్యుడ గాక యుండిన నను న్బాటించి యొక్కింత నీ
నిడువాలుం గడకంటజూడు మనుచు న్నిల్చోపమిం బై చెరం
గొడియం జేవిరిదమ్మి వ్రేయుటకునై యుంకించిజంకించినన్.

కృష్ణరాయడు — శ్రీకృష్ణులవారి ప్రసంగం చిత్తగిం చారా ఆంధ్రకవితా పితామహులు ?

పెద్దన్న — చిత్తం చిత్తం, రాధాదేవమ్మగారు దిద్దితీర్చిన రసికులు కదా వారు భూలోక దేవేంద్రా !

కృష్ణరాయడు — అవునవును. అది యిక్కడ స్పష్టంగానే కనపడుతోంది. బాగా సెలవిప్పించారు తమరు. (తిమ్మరు సయ్యకేసి చూస్తాడు)

తిమ్మరుసయ్య — అల్లసానివారు సెలవిప్పించింది కాదన డం లేదు. కాదనాలేను నేను. మరి, అప్పుడే రాధాదేవమ్మ గారి ప్రసక్తి తేవడం సముచితం కాదేమో అని మాత్రమే నా అనుమానం.

కృష్ణరాయడు — అదేమిా ?

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారి ప్రసంగం విశిష్టంగా లేకపోలేదు. అయితే, దక్షిణనాయకులైనవారి కందరికీ సర్వ సామాన్యం అది.

కృష్ణరాయడు — మరి, తమసెల వేమిటీ ?

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారు తమ తప్పెరిగి మసు లుకుంటున్నా రంటాను మహాప్రభూ !

కృష్ణరాయడు—(చకితుడై) తప్పా?

తిమ్మరుసయ్య — అవును మహాప్రభూ!

కృష్ణరాయడు — శ్రీకృష్ణులవారు, నారదమహర్షి తమకు ప్రసాదించిన పారిజాతపుష్పం రుక్మిణీదేవమ్మగారికి దయచెయ్యడం తప్పంటారా తమరు?

తిమ్మరుసయ్య — మనవిచేసుకుంటాను రసికచక్రవర్తీ?

కృష్ణరాయడు — (పెద్దన్నతో) విందాం.

పెద్దన్న — చిత్తం చిత్తం.

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారి యెనమండుగురు పట్టమహిషుల్లోనూ, కవులందరూ, రుక్మిణీదేవమ్మగారికీ సత్యభామాదేవమ్మగారికిన్నీ మాత్రమే ప్రాముఖ్యం చూపిస్తున్నారెప్పుడూ.

కృష్ణరాయడు — అవును.

తిమ్మరుసయ్య — శ్రీకృష్ణులవారు పారిజాతపుష్పం రుక్మిణీదేవమ్మగారికే అనుగ్రహించడం వుచితంగానే వుందని తక్కిన ఆరుగురు దేవేరులూ సమాధానపడ్డట్టు తిమ్మకవిగారే సెలవిప్పించివున్నారు.

కృష్ణరాయడు — సత్యమే.

తిమ్మరుసయ్య — ఇక మిగిలివుండినవారు సత్యభామాదేవమ్మగా రొక్కరే.

కృష్ణరాయడు — అవును.

తిమ్మరుసయ్య — వా రందు కెంతమాత్రమూ యిష్టపడ

లేదు. అలా యిష్టపడ్డం వారి ప్రకృతే కాదు, అసలు.

కృష్ణరాయడు — కనపడుతూనే వుంది.

తిమ్మరుసయ్య — అంచేత వారు కోపించడమూ, కోపగృహం ప్రవేశించడమూ ధర్మమే అని శ్రీకృష్ణులవారికిన్నీ తెలుసు.

కృష్ణరాయడు — (పెద్దన్న కేసి చూస్తాడు)

పెద్దన — ఆయెరుకే శ్రీకృష్ణులవారి దక్షిణనాయకత్వానికి విశిష్టత మహాప్రభూ!

కృష్ణరాయడు — (సాలోచనగా తల పంకించుకుని, తిమ్మరుసయ్యతో) సరే, సెలవిప్పించండి.

తిమ్మరుసయ్య — రుక్మిణీదేవమ్మగారి నగరిలో వుండగా లభించిన పారిజాతపుష్పం ఆవిడకే దయచెయ్యడం యెలాంటి ధర్మమో, దానిమీద — మత్సరప్రకృతి అయిన ఆకారణం వల్ల — మనోవ్యథ పొందుతున్న సత్యభామాదేవమ్మగారిని సాంత్వనపరచడమున్నూ అలాంటి ధర్మమే కాదా మహాప్రభూ?

కృష్ణరాయడు — శ్రీకృష్ణులవారు సర్వాత్మనా తమ చెప్పుచేతల్లోనే వుండాలనీ, తను కనుసన్నల్లోనే మెలగాలనీ, సర్వమూ తమకే కూరుస్తూ వుండాలనీ సత్యభామాదేవమ్మగారు భావించడం (ఆగి) ధర్మం అవుతుందా?

తిమ్మరుసయ్య — ధర్మాధర్మవిచారణకు అతీతమైన విషయం మహాప్రభూ యిది. ఏమంటే? సత్యభామాదేవమ్మగారి విషయమై అలావుండడమూ, అలా మెలగడమూ, అలా కూరు

స్థానే వుండడమూ – ఇది శ్రీకృష్ణులవారి శపథమే రాజేంద్రా!

కృష్ణరాయడు — ఆ! ( ధూర్జటికేసి చూస్తాడు )

ధూర్జటి — ఒకరి బలవంతం యేమీ లేదు మహాప్రభూ ఇందులో. శ్రీకృష్ణులవారికి యిష్టాపూర్తి అయిన శపథం యిది.

కృష్ణరాయడు — వింతగా వుంది.

ధూర్జటి — మనవిచేసుకుంటూ. (తిమ్మకవితో) "మనముల, మాటలం, గ్రియల" అన్న పద్యం మళ్లీ వోకమాటు సెల విప్పించండి.

తిమ్మకవి —చిత్తం చిత్తం. ( మనముల మాటలం గ్రియల— చదువుతాడు )

కృష్ణరాయడు— అవునవును, విన్నపద్యమే యిది. బాగానే వుంది, మరి, యిప్పుడు శ్రీకృష్ణులవారి తప్పేమిటీ ?

తిమ్మరుసయ్య — ధూర్జటికవిగారు సెలవిచ్చివుండినట్టూ, తమరున్నూ అంగీకరించే వుండినట్టూ పూర్తిగా పరమావధి పొందివుండిన సత్యభామాదేవమ్మగారి ఆ ఆగ్రహం సముదా యించకపోతే – (మాట నాన్చేస్తాడు)

కృష్ణరాయడు — అదా ? (ఆలోచనలో పడతాడు)

తిమ్మకవి — (రాయనికేసిచూస్తూ తలపంకించుకుంటాడు)

పెద్దన్న — (అపవారించి, ధూర్జటితో) మహామంత్రుల వారి ప్రసంగంలో యేదో ధ్వనిస్తోంది.

ధూర్జటి — (అపవారించి, పెద్దన్నతో) కనిపెట్టారు గదా! కాని అదేమిటో బ్రహ్మభేద్యంగా వుంది.

పెద్దన్న — (మళ్లీ అపవారించి) బాగా గమనించాలి.
కృష్ణరాయడు — (తిమ్మకవితో) తమరు కానివ్వండి.
తిమ్మకవి — చిత్తం మహాప్రభూ !

ఉ. పాటలగంధి చిత్తమున బాటిలు కోపభరంబు దీర్ప, నె
ప్పాటను బాటుగామి, మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి — మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట — నాజగ
న్నాటక సూత్రధారి — యదునందను డర్మిలి మ్రొక్కె-
మ్రొక్కెనన్.

రాయని కనుబొమలు ముడిపడతాయి. తిమ్మరుసయ్య మొగాన గాంభీర్యం అంకితం అవుతుంది. తిమ్మకవి రాయనికేసి సాకూతంగా చూస్తాడు. పెద్దన్నా ధూర్జటీ రాయణ్ణి విడిచి తిమ్మరుసయ్యనీ తిమ్మరుసయ్యనీ విడిచి రాయణ్ణీ శ్రద్ధగా చూస్తారు.

కృష్ణరాయడు — (తల పంకించుకుని) అప్పాజీ !
తిమ్మరుసయ్య — చిత్తం మహాప్రభూ !
కృష్ణరాయడు — శ్రీకృష్ణులవారు తమ తప్పు దిద్దుకోడం పూర్తి అయినట్టా ?

తిమ్మరుసయ్య — విన్నవించుకుంటాను రాజాధిరాజా ! మమ్మేలినవారి ప్రశ్న బహూ విశదంగా కనపడుతోంది ; కాని మిక్కిలీ గంభీరమైన దది. ప్రకరణమున్నూ అలాగే యెంతో జటిలమైనది. ఏమంటే ? రుక్మిణీదేవమ్మగారి దగ్గిర యిలాంటి సందర్భం తటస్థించనే-తటస్థించదు. గత్యాగత్యా తటస్థించినా

అది పాదాభివందనప్రసక్తి రాకుండానే చెల్లిపోతుంది. ఇక సత్యభామాదేవమ్మగారి సంగతి సర్వాత్మనా యిందుకు భిన్న మైనది. అది వొక వ్యవస్థలో వుండేది కాదు. "క్షణక్షణ ముల్ జవరాండ్ర చిత్తముల్" అంటూ మన ఆంధ్రకవితా పితామహులు సెలవిప్పించినది సత్యభామాదేవమ్మగారి వంటి వారికే సమన్వయిస్తుంది. వారి ప్రవృత్తికీ పొంగులువారే పాలకున్నూ మాత్రమే పోలిక.

ధూర్జటి — బహూ రసవంతమైన వివరణ మహాప్రభూ!

కృష్ణరాయడు — సందేహమా?

తిమ్మరుసయ్య — నిర్హేతుకజాయమానకటాక్షం వల్ల నన్నిప్పుడిలా పెద్దచేస్తున్నారే గాని, మన ధూర్జటి కవిగారు గడియకిందటే సెలవిప్పించి వున్నారు. "సత్యభామాదేవమ్మ గారి ప్రవృత్తి గ్రహించే శక్తి శ్రీకృష్ణులవారికే వుంది" అని.

కృష్ణరాయడు — ఆ శ్రీకృష్ణులవారి ఆంతర్యం గ్రహించే నైపుణ్యం — (మాట నాన్చేస్తాడు)

తిమ్మరుసయ్య — అవును మహాప్రభూ! అది తిమ్మకవి గారికే వుందనిన్నీ వారు సెలవిప్పించివున్నారు. కనక, మేలిన వారి ప్రశ్నకు ప్రత్యుత్తరం చెప్పజాలినవారు తిమ్మకవిగారే.

ధూర్జటి — బాగుంది.

తిమ్మరుసయ్య — మ మ్మేలినవారి క్కలిగిన సందేహమే నాకున్నూ కలిగింది, కనక, నేనూ వారిని ప్రార్థిస్తున్నాను.

(అందరూ చకితులవుతారు.)

కృష్ణరాయడు — (తిమ్మరుసయ్యతో) తమరు మిక్కిలీ గంభీరంగా వుపన్యసించారు; కాని సత్యభామాదేవమ్మగారి తోడి సాహచర్యం కత్తులమీద పరీక్షగా వుంది.

తిమ్మరుసయ్య — చిత్తం, వొప్పుకుంటాను మహాప్రభూ! మరి, సాహసరసికుల దగ్గిరే కదా విలాసవతుల హొయిళ్ళకు సార్థకత?

కృష్ణరాయడు — (పెద్దన్న కేసి జిజ్ఞాసగా చూస్తాడు)

పెద్దన్న — వివరించుకుంటాను మహాప్రభూ? నాయకుడు సావధానత కనపరిచిన కొద్దీ నాయిక ప్రతిభ నమనవోన్మేషం పొందుతూ వుంటుంది. దాని కాలంబనం కావలసిన బాధ్యత కూడా అటుతిరిగి మళ్ళీ నాయకునిమీదే పడుతూ వుంటుంది. మహామంత్రులవారి వుద్దేశం — (తిమ్మరుసయ్య కేసి చూస్తూ మాట నాన్చేస్తాడు)

తిమ్మరుసయ్య — క్రాంతదర్శులు కనక, పెద్దన్నగారు నా వుద్దేశం బహూ విశదంగా ప్రకటపరిచారు మహాప్రభూ! (పెద్దన్నతో) తమ వివరణతో శ్రీనాథకవిసార్వభౌముల అర్థాంతరన్యాస మొకటి ఝుడితిగా స్ఫురిస్తోంది నాకు.

పెద్దన్న — "...లేజవరాలు చెక్కుగీటిన వసవల్చుబాల కుడు డెందమునన్ గరుగంగనేర్చునే?" అన్నదే కాదూ?

తిరుమ్మరుసయ్య — చిత్తం చిత్తం, సరిగా అదే.

కృష్ణరాయడు — (చకితుడవుతాడు)

పెద్దన్న — (రాయని కేసి సాకూతంగా చూస్తాడు)

కృష్ణరాయడు — (తిమ్మకవితో) తమరు కానివ్వండి.

తిమ్మకవి — చిత్తం రసికచక్రవర్తీ !

మ. జలజాతాసన —

కృష్ణరాయడు — వ్యవధానం రసభంజకం కనక, వెనకటి పద్యం మళ్ళీ వొకమాటు సెలవిప్పించి, ఆవరసనే తరవాతి పద్యా లందుకోండి.

తిమ్మకవి — చిత్తం మహాప్రభూ ! (పాటలగంధి చిత్తమున — చదివి, రాయని కేసి గంభీరంగా చూస్తూ ఆచి ఆచి,— )

మ. జలజాతాసనవాసవాది సురపూజా భాజనంబై తన
ర్చులతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదంబు
నన్ । దొలగం ద్రోచె లతాంగి — అట్లయగు నాథుల్ నేర
ముల్ సేయఁ బే । రలుకం జెందినయట్టి కాంత లుచిత
వ్యాపారముల్ నేర్తురే ?

(చకితుడై రాయడు మళ్ళీ ఆలోచనలో పడతాడు.
తిమ్మరుసయ్య రాయని కేసి చూస్తూ వుంటాడు)

పెద్దన్న — (అపవారించి, ధూర్జటితో) ఈకల్పన ప్రభువు నుద్దేశించే, సందేహం లేదు.

ధూర్జటి — ( అపవారించి, పెద్దన్నతో ) అలాగే కనపడుతోంది. మరి, యింత సాహసాని క్కారణం ?

పెద్దన్న — ( మళ్ళీ అపవారించి ) తలా తోకా కనపడ్డం లేదు. ఏదో పెద్దగొడవ మాత్రం వుంది. ( రాయని యింగితం కనిపెట్టి ) ప్రభువు ఏమో అంటున్నారు.

కృష్ణరాయడు — (తిమ్మకవితో) మళ్ళీ అందుకో రేమీ?
తిమ్మకవి — అందుకుంటున్నాను మహాప్రభూ!
క. కోపనపదహతి గుహనా

గోపాలుడు గాంచి మెయి గగుర్పొడువగ ను
ద్దీపిత మన్మథరాజ్య
ప్రాపితుడై పలికె గూర్మి బయలుపడంగన్.

కృష్ణరాయడు — (చకితు డవుతాడు)
తిమ్మకవి — ఉ ద్దీపిత మన్మథరాజ్య
ప్రాపితుడై పలికె గూర్మి బయలుపడంగన్.

మ. నను భవదీయదాసుని, మనంబున నెయ్యపుగిన్క బూనితా
చినయది నాకు మన్ననయ — చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము తాకున నొచ్చునంచు నే
నని మొద, నల్కమానవు గదా యికనైన నరాళకుంతలా?

కృష్ణరాయడు — (నిర్విణ్ణు డయి, అంతలో గాంభీర్యం అవలంబించి) అప్పాజీ! ఇవాళకి — ఈపాటికి — సభ చాలిద్దాం. (అంటూనే లేస్తాడు)

తిమ్మరుసయ్య — (తానున్నూ లేచి) చిత్తం మహాప్రభూ!
(అందరూ దిగ్గున లేస్తారు. రాయడు వాసగృహానికి వెళ్ళిపోతాడు. తిమ్మరుసయ్య ద్వారందాకా వెంట వెళ్ళి సెలవుపొంది వెనక్కి మళ్ళుతాడు. సభ్యులందరూ వొే అంతరువుకి ఆ అంతరువుగా గుంపులుగా కూడి వింతపడుతూ మాట్లాడుకుంటూరు)

ధూర్జటి — (వేదిక దిగాటప్పటికి వెళ్ళి గభీమని తిమ్మకవిని కౌగిలించుకుని) మహాకవీ! ఆనందాతిరేకం వల్ల నాకు మాటలు రావడం లేదు. ఇంత సుతారంగా ప్రణయకలహం నడిపిన కవి తమరు తప్ప మరొకరు కనపడరు. కాళిదాసు శకుంతలనూ, భవభూతి సీతా అమ్మవారినీ, శ్రీనాథ కవిసార్వ భౌములుదమయంతీ అమ్మవారినీ దిద్దినట్టు సత్యభామా దేవమ్మ గారిని తమ రతిలోకరమణీయంగా దిద్దితీర్చారు. పూర్వపుణ్యాం వల్ల నాకు తమతో సమకాలితత్వం లభించింది.

తిమ్మకవి — (చేతులు జోడించుకుని) తమ యెదట నేను సూర్యుని యెదటి దివిటీని. తమప్రశంసలు నాకు పదికోట్లు. ఈ అనుగ్రహమే యెప్పుడూ వుంచకోరుతున్నాను.

పెద్దన్న — (తిమ్మకవిని కౌగిలించుకుని) మహాకవీ! తమ భావనాశక్తి అపూర్వం అని యెరుగుదును. దాని నైశి త్యమూ, దాని ఔజ్వల్యమూ ఇవాళ నాకు పూర్తిగా తెలిసి వచ్చాయి —

తిమ్మకవి—(చేతులు జోడించుకుని) దేశం దేశం అంతా పుత్రాత లూగించిన కవిశేఖరులు తమరు. తమ సన్నిధిని నుంచోడాని కయినా—

తిమ్మరుసయ్య—(ఇంతలో వెనక్కి వచ్చి, తిమ్మకవి రెండు చేతులూ పట్టుకుని) మహాకవీ! మంచికల్పన చేశారు తమరు. శృంగారకవిత్వం చెరకాకుబల్లెం అవుతుం దని నేనెప్పుడూ అనుకోలేదు. తమ కలంపోటుతో యెలాంటి గంభీరహృద

యాలూ కూడా జర్జరితా లయిపోయాయి. తమరు ధన్యులు. తమతో సాహచర్యం నాకు ఉత్తేజకం.

తిమ్మకవి—(చేతులు జోడించుకుని) తమ రసికత అతిలోక రమణీయం. తమ ప్రశంస లభించడం నిజంగా నా అదృష్టం. ఏమంటే ? ఇవాళ నేను ఇంతమంది పండితకవుల సన్నిధిలో యిలా తల యెత్తుకోగలుగుతున్నా నంటే అది తమఅనుగ్రహం.

ఈస్థితిలో వొక పరిచారిక వచ్చి తిమ్మకవితో "ప్రభువు సెల వయింది" అంటుంది. "దయ చెయ్యండి, దయచెయ్యండి" అంటూ తిమ్మరుసయ్య తొందరపెట్టగా "నన్నే, నన్నే ?" అంటూ తిమ్మకవి పరిచారికతో వెళ్ళిపోతాడు.

తిమ్మరుసయ్య — ( పెద్దన్నతోనూ, ధూర్జటితోనూ ) ప్రభువు హఠాత్తుగా సభ చాలించారు.

పెద్దన్న — కారణం —

తిమ్మరుసయ్య — బ్రహ్మభేద్యంగా వుంది. ఏమీ అందడం లేదునాకు.

ధూర్జటి — కారణమూ వుంటుంది, అది అసాధారణమూ అయి వుంటుంది —

తిమ్మరుసయ్య — మనం అలాగే అనుకోవాలి మరి. (పెద్దన్నతో) ఇందాకా, నావుద్దేశం — ( మాట నాన్చేస్తాడు)

పెద్దన్న — "తద్వపుఃకీలిత పంచసాయకశిఖన్" అన్న సందర్భంలోనే కాదూ ?

తిమ్మరుసయ్య — అవునవును.

పెద్దన్న — ప్రణయసరణి బహుసుఖం —

తిమ్మరుసయ్య — అదీ మాట. ప్రకరణవైరుధ్యంలేకుండా అది నడిపించాలంటే లోకానుభవమే కాదు, కవికి గుండె నిబ్బరమున్నూ వుండాలి.

పెద్దన్న — చిత్తం చిత్తం.

తిమ్మరుసయ్య — తిమ్మకవిగారు రెండువైపులా పదునుగల కత్తి కదా ?

పెద్దన్న — సందేహమా ? అక్కడ, తిమ్మకవిగారు కనక, శ్రీకృష్ణులవారలా చెయ్యడంతోటే, సత్యభామాదేవమ్మగారు ఈసుచెంది - అంటే వుడుకుమోత్తనంవచ్చి పాదప్రహారం చేసినట్టు వర్ణించగలిగారు. మరొక సామాన్యుడైతే ముగ్ధలై ఆశ్లేషం చేసినట్టు —

తిమ్మరుసయ్య — శివశివా ! అంతకంటే రసాభాస మరేమి వుంటుందీ ? అసలు, పారిజాతప్రబంధరచనోద్యోగానికే అది భంగకరం కదా ?

పెద్దన్న — ( తల పంకించుకుంటాడు )

ధూర్జటి — అయితే, నావూహ మనవిచేసుకోవచ్చా ?

తిమ్మరుసయ్య — సెలవిప్పించండి.

ధూర్జటి — నిన్నటి కథాసందర్భం హఠాత్తుగా యివాళ కొత్తతోవ తొక్కినట్టు —

తిమ్మరుసయ్య — తమరుకనిపెట్టారు, నానమ్మకమూఅదే.

పెద్దన్న — అవు నవును. తిమ్మకవిగారి వాగ్ధోరణిలో యివాళ వైలక్షణ్యంకూడా కనపడింది, తమరు సెలవిచ్చింది -

తిమ్మరుసయ్య — అదీ వుంది — మరి, లోపల పని వుంది, సెలవిప్పించండి నాకు.

పెద్దన్న — చిత్తం సెలవు.

ధూర్జటి — చిత్తం దయచెయ్యండి, సెలవు.

తిమ్మరుసయ్య లోపలికి వెళ్ళిపోతాడు. పెద్దన్నా, ధూర్జటీ, మాదయగారి మల్లన్నా వొక్కచోట చేరతారు.

మల్లన్న — (పెద్దన్నతో) ఏమి టంటారు బావగారూ ?

పెద్దన్న — తమరూ నేనూ—

ధూర్జటి — నన్ను కూడా చేర్చుకోండి.

పెద్దన్న — (మల్లన్నతో) చిత్తగించారా ? ఎవ రన గలిగిందీ వొకటే. ఏమీ తెలియడంలేదు. ఎంతమాత్రమూ అందడమే లేదు.

మల్లన్న — కాని సాహసం మాత్రం యేదో జరిగివుంటుంది తప్పదు.

ధూర్జటి — అజరిగిపోయింది సాహసమే అయితే, తిమ్మకవి బాబుగారు చేసింది మహాసాహసం అనాలి కదా ?

మల్లన్న — కాక, వారి కేం ? మహారాణీ పక్షంవారు కదా వారు ?

పెద్దన్న — అలా అన్నారుగదా తమరు ? (సాలోచనగా

పక్కకి చూసి) అవునవును, తెలిసింది. (ధూర్జటితో) తెలిసిపోయింది.

ధూర్జటి — అంతఃపురంలో —

పెద్దన్న — (పెదవులు బిగించుకుని, అవునన్నట్టు తల పంకిస్తాడు)

ధూర్జటి — ప్రణయకలహం—

పెద్దన్న — అన్నమాట. ఏమీ సందేహం లేదు.

ధూర్జటి — అదే నిజమయితే పాదప్రహారం దాకా వెళ్ళి వుండాలి, వొప్పుకుంటారా తమరు ?

పెద్దన్న — నే నొప్పుకోకపోతే తమ రొప్పుకుంటారా మరీ ?

మల్లన్న — అయితే, యీకల్పనకు ఆప్రణయకలహామే మూలం —

పెద్దన్న — అక్షరాలాను. కాకేం ?

మల్లన్న — మరి, దానివల్ల ప్రభువుకి ఆగ్రహం వచ్చినట్టా అనుగ్రహం వచ్చినట్టా ?

ధూర్జటి — ఆగ్రహమా ? ఎంత మాటా ? ఇంతాచేసి వారి ప్రభుత్వం మన దగ్గిరటండీ ? (పెద్దన్నతో) ఏమంటారు తమరు ?

పెద్దన్న — తమరున్నూ వొకమాటు మన సత్తా చూపించే వున్నారు గదా, తమ రన్నది కాదని యెలా అనగలనూ నేను?

మల్లన్న — అవునవును, (పెద్దన్నతో) నిరుపహాత స్థలం

అన్న పద్యానికి సంబంధించిన ఘట్టం జ్ఞాపకం వస్తోంది. తమ రున్నూ —

ధూర్జటి — కనక, చిత్తగించారూ? అందువల్ల, ఆగ్రహం రాకపోవడమే కాదు, దాంతో, ఘనీభవించిపోయిన బెట్టుసరీ నీరయిపోయి వుంటుంది. అంచేత, ప్రహరించిన ఆపాదాలు సంవాహనం చేసేటంతటి అనుతాపం వచ్చి వుంటుంది. అలాంటి కల్పనచేసినందుకు బాబుగారి పాదాలు ఆనందబాష్పాలతో అభిషేకించేటంతటి భక్తివిశ్వాసాలున్నూ అంకురించివుంటాయి. (పెద్దన్నతో) ఏమి సెలవిప్పిస్తారు బాబుగారూ?

పెద్దన్న — (మల్లన్నతో) ధూర్జటి కవిగారి వూహ సము చితంగానే వుంది. అయితే "ఆస్థానాధీశ్వరుల ప్రణయకలహా లకూ, ఆస్థానకవుల గ్రంథరచనకూ సంబంధం యేమిటీ? తమ కవు లిలాంటి విషయాలలో జోక్యం కలిగించుకుంటే ప్రభువులు సహిస్తారా?" అని తమరు సందేహిస్తున్నా రనుకుంటాను.

మల్లన్న — సందేహిస్తున్నా నంటే —

ధూర్జటి — ఏమయినా, యిది తిమ్మకవిబాబుగారి విష యమై చెల్లదు. ఏమంటే? వారు, ఇక్కడి ఆస్థానకవులు మాత్రమే కారు, అక్కడి రాజప్రతినిధులున్నూ. ఈస్థితి గుర్తించుకుంటే గాని వారి సాహసం బోధపడదు.

మల్లన్న — చిత్తం చిత్తం, తమరు సెల విప్పించింది —

ధూర్జటి — ఇంకోటిన్నీ వుంది. దీంతో బాబుగారు, దుర్ఘటమైన స్వామికార్యం వొకటి నిర్వహించుకుని వుంటారు.

పెద్దన్న — నిజం నిజం.

**ధూర్జటి** — కవిత్వమూ, రాజకార్యనిర్వాహకత్వమూ — ఈ రెండు శక్తులూ, వుభయకవిమిత్రులైన తిక్కయజ్వగారి తరవాత మళ్ళీ యిన్నాళ్ళకి మన తిమ్మకవిబాబుగారి యందు మూర్తీభవించాయి.

పెద్దన్న — అది ముమ్మాటికీ సత్యం. (స్ఫురణ అభినయించి) ఇంకోటి చిత్తగించారూ ? (ఇటూ అటూ చూస్తూ ఆలోచించి) ఇక్కడ కాదు, దయచెయ్యండి, మనవిచేస్తాను. (మల్లన్నతో) దయచెయ్యండి.

మల్లన్న — (అడుగు వేస్తూ) వస్తున్నా.

అందరూ వెళ్ళిపోతారు.

1936 జనవరి భారతినుంచి.
(సవరణలతో)

# పునాదిరాయి



## పాత్రలు

కర్ణుడు
అర్జునుడు
దుర్యోధనుడు
దుశ్శాసనుడు
కుంతీదేవి
ఇద్దరు పరిచారికలు



# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# పునాదిరాయి

---

## మొదటి రంగం

స్థలం :— హస్తినాపురం రాజభవనాల్లో కుంతీదేవి నగరు. మేడమీద విశాలమైన వొక గది. అది వెలగల అనేక వస్తువులతో రమణీయంగా వుంది. కుంతీదేవి, బాలీసు ఆనుకుని కొంచెం వొరిగి రత్నకంబళీమీద కూచుని వుంది. వితంతువు కనక, ఆమె, తెల్లచీర కట్టుకుని అలాంటిదే రైక తొడుక్కుని వుంది. ముక్కున బులాకీ, మెడలో వొక రత్నహారమూ, చేతులకు కంకణాలూ పోచీలూ, ఎడమచేతి అనామికకు రత్నాలు పొదిగిన వుంగరమూ—ఇంతే ఆమె ధరించిన నగలు. నడివయస్సు. మంచి కళగల మొగం. పైగా, అప్పుడు అపూర్వమైన ఉత్సాహంతో తేలిపోతూ వుంది.

ఎదట, బాలకర్ణుడు నుంచుని వున్నాడు, చేతులు కట్టుకుని.

కుంతి ఆజ్ఞవల్ల పరిచారికలందరూ తలో పనిమీదా కిందికి వెళ్లిపోయి వున్నారు.

సమయం—మధ్యాహ్నం జాము పొద్దువేళ.

---

కుంతీదేవి—అలాగటోయ్ ?

కర్ణుడు — చిత్తం అమ్మా! మానాయన వృత్తి నగరిలో కొలువు. సారథ్యం చేస్తాడు. అశ్వారోహణం, గజారోహణం, రథచోదనం— ఇలాంటివి రాజపుత్రులకు నేర్పుతూ కూడా వుంటాడు, అమ్మగారూ!

కుంతీదేవి — అయితే, మీ అమ్మ పే రేమిటి నాయనా?

కర్ణుడు — రాధ అమ్మగారూ!

కుంతీదేవి — రాధా? నీకు బాగా తెలుసా?

కర్ణుడు — మా అమ్మపేరే నాకు తెలియకుండా వుంటుందా అమ్మా?

కుంతీదేవి — కొడుకులు తల్లిని పేరుపెట్టిపిలవరు కాదూ? అంచేత నీకు తెలియదేమో అనుకున్నానోయ్?

కర్ణుడు — తమరు సెలవిప్పించింది నిజమే; కాని యితర్లు పిలిచినప్పుడైనా తల్లి పేరు కొడుక్కి వినపడకుండా వుంటుందా, అమ్మా? అదీ కాక. ఎంత పని వుండినా, తల్లిని కొడుకూ కొడుకుని తల్లీ విడిచి వుండడం కష్టం గదా, యేదో విధంగా కొడుక్కి తల్లిపేరు వినపడకుండానూ, తెలియకుండానూ అల వాటు కాకుండానూ యెలా వుంటుం దమ్మగారూ?

కుంతీదేవి — కన్నకొడుకుని శాశ్వతంగా విడిచిపెట్టేసి వుండే తల్లిపీనుగులు లోకంలో వుండ రంటూవా నాయనా? లేక పోతే, అలాంటివాళ్ళు రాకాసులే కాని తల్లులే కారంటూవా?

కర్ణుడు — అమ్మా! అలాంటి దారుణప్పని చెయ్యవల

సిన అవసరం యెలాంటి సందర్భంలో నయినా తల్లి కేర్పడు తుందా ? ఏమో, లోకం సంగతి నాకు కొంచెమూ తెలియ దమ్మగారూ ! నే నెక్కడి కయినా వెళ్ళి ఇంటికిరావడం క్షణం ఆలస్యం అయినా, మా అమ్మ నాకోసం పరితపించిపోతూ వీధిగుమ్మంలో నుంచుని వుంటుం దండి. ఒక్కొక్కప్పుడు వీధి చివరి దాకా వచ్చి యెదురుచూస్తూ కూడా వుంటుందండి.

కుంతీదేవి — అంత వాత్సల్యవంతురాలేం రాధ ?

కర్ణుడు — చిత్తం అమ్మా ! మా అమ్మని విడిచి బయట చాలా సేపుండడం నాకూ కష్టంగానే వుంటుందండి.

కుంతీదేవి — ఎంత అదృష్టవంతురాలోయి రాధ !

కర్ణుడు — కనక, మా అమ్మ పేరు నాకు బాగా తెలుసు నమ్మగారూ ! మా అమ్మపేరు రాధేనండి. ఇరుగుపొరుగు వారు మా అమ్మని "రాధమ్మా" అనీ, నన్ను "రాధ కొడకా" అనీ పిలుస్తూవుంటా రమ్మా ! నేను రాధ కొడు కుని కావడంవల్ల, నా కసలు పేరొకటి వుండినా, మాకులం వారు నన్ను రాధేయు డనిన్నీ అంటూ వుంటారండి.

కుంతీదేవి — కౌంతేయు డన్న పేరు లేదూ ? అలాగే యిదీని. కనక, నిన్ను రాధేయు డనడం కూడా వుందన్నమాట.

కర్ణుడు — అవునమ్మగారూ !

కుంతీదేవి — పెట్టిపుట్టింది రాధ, ఎన్ని జన్మల్లో యెంతెంత పుణ్యం చేసుకుందో మరి ? అవునా ?

కర్ణుడు — మరి నేనో అమ్మగారూ ? ఎన్ని జన్మల్లో నే

నెంతెంత లేసి తపస్సులు చేసుకున్నానో రాధ కడుపున పుట్ట డానికి ?

కుంతీదేవి — వెర్రినాయనా !

కర్ణుడు — భీష్మాచార్యులవారూ, విదురుడు గారూ తరుచు నన్ను రాధేయా అనే అంటూ వుంటారండి.

కుంతీదేవి — ఏమిటీ ? వారా ? నిన్నా ? ఎంతమాటా ! (డగ్గుత్తికతో) నిన్ను రాధకొడుకా అంటేనే వారికి తృప్తి కామోసు.

కర్ణుడు — చిత్తం అమ్మగారూ !

కుంతీదేవి — ఆహా ! ఏమి జాగ్రత్తా ? ఏమి ప్రభుధర్మమూ?

కర్ణుడు — వారి తృప్తిమాటకేం అమ్మగారూ ! ఎవ రయినా నన్ను రాధేయా అంటే నాకు కలిగే ఆనందం యెవరు పరిమితి కట్టగలరూ ?

కుంతీదేవి — అయ్యో నా తండ్రీ, అలాగటోయ్ ?

కర్ణుడు — నగరంలో కూడా యీ పేరు చాలామందికి తెలుసునండి.

కుంతీదేవి — తెలియదూ మరీ ? రాధ అదృష్టవంతురా లయినప్పుడు నీ అసలుపే రెవరి క్కావాలీ ? తెలవడం మాత్రం యెవరికి తెలుస్తుందీ ?

కర్ణుడు — తెలియకేం అమ్మగారూ !

కుంతీదేవి — అయితే, నీ అసలుపే రేమిటీ మరిచిపోయాను.

కర్ణుడు — కర్ణుడు అమ్మగారూ !

కుంతీదేవి — ఇంతేనా మరోపేరు కూడా వుందా నీకు ?

కర్ణుడు—ఉంది అమ్మగారూ ! వసుషేణు డనికూడా అంటారు నన్ను.

కుంతీదేవి — వసుషేణుడా ! ఏమో నా కంత నచ్చలేదు. కాని తెచ్చుకున్నట్టుంది చెప్పవద్దూ ?

కర్ణుడు — అది కూడా పెద్దలు పెట్టిన పేరే నమ్మా ! కాని అంత వాడుకలో లేదు.

కుంతీదేవి — ఏమో నాయనా, మనిషి కొక రుచి. నా మట్టుకి, రాధేయు డనే పేరుకంటె కర్ణుడనే పేరే యెంతో బాగుంది; కాని మధ్య వచ్చిన పేరయినా అది యిక పోదులే.

కర్ణుడు—పోవడం నాకు శ్రేయస్కరమూ కాదమ్మగారూ!

కుంతీదేవి — స్స ! నాయనా నిన్ను చాలాసేపు నుంచో పెట్టాను. ఎన్నిమార్లు కోరినా కూచున్నావే కావోయ్ ! అయితే, వర్తమానం చేస్తే మాట తీసెయ్యకుండా వచ్చావు. హృదయం పొంగిపోయే లాగ ఎంతో చక్కని పాట పాడావు పాపం ! అంతేచాలు. మీ అమ్మ మాట తీసెయ్యవు నువ్వు. ఏమోయ్ ? అవునా ? మీ అమ్మమాట తీసెయ్యవు కాదూ నువ్వూ ?

కర్ణుడు — తల్లిమాట వేదవాక్యం కంటే గొప్పది కాదండీ అమ్మా ? తల్లిమాట తిరస్కరిస్తే కొడుక్కి జయం కలుగు తుందా అమ్మగారూ ?

కుంతీదేవి — కలగదు నాయనా, కలగదు, నువ్వు సరిగా

చెప్పావోయ్! నీ కన్నీ తెలుసునోయ్! కాని, పాపం, నిన్ను చాలాసేపు నుంచోపెట్టాను, వస్తానుండేం?

( కళ్లు తిప్పుకుంటూ యిలా అని, దిగ్గున లేచి, కుంతి మరోగదిలోకి వెళుతుంది. "అమ్మగారూ" అని పిలుస్తూ అప్పుడప్పుడు డొక్క దూకున వచ్చి కర్ణుణ్ణి చూసి తకీమనిఆగిపోతాడు )

అర్జునుడు — ( దర్పంగానూ, కోపంగానూ ) ఎవరు నువ్వు?

కర్ణుడు — నేను సూతుణ్ణి. నాపేరు కర్ణుడు.

అర్జునుడు — ఇక్కడి కెందుకు వచ్చావ్?

కర్ణుడు — వీధిలో నాదారిని నేను వెడుతూ ఉండగా కుంతీదేవమ్మగారు నన్ను పిలిపించారు.

అర్జునుడు — కుంతీదేవమ్మగారు నిన్ను పిలిపించారూ? అయితే? రత్నకంబళిమీద నుంచుంటావూ? ఏమి పొగరూ?

కర్ణుడు — ( చురుగ్గా చూస్తూ ) మాటలు మిగలవద్దు. తెలిసిందా? కుంతీదేవమ్మగారు నన్ను పిలిపిస్తేనే వచ్చాను. నేనే యెందుకని చూశాను; గాని కుంతీదేవమ్మగారు నన్ని రత్నకంబళీమీద కూచోమనే సెలవిప్పించారు చాలామాట్లు.

అర్జునుడు — ( తల పంకిస్తూ ) ఓ — హూ! కుంతీదేవమ్మగారు నిన్ను కూచోమని ప్రార్థించారేం? గొప్పరాజపుత్రుడవనీ పాపం!

కర్ణుడు — కూచోడం అనేది మనుష్యమాత్రులకందరికీ సామాన్య ధర్మం. ఒక రాజపత్ని స్వయంగా కూచోమని

సెలవిప్పించినప్పు డిక యెవటివా రేకులంవా రన్న విచా రణ యెందుకూ ? కాక :— రాజు కావడంలో వుంది ; కాని రాజపుత్రుడు కావడంలో విశేషం యేమి వుందీ ?

అర్జునుడు — అబ్బో ! మాటలు నేర్చావు. మళ్ళీ మాట్లా డా వంటే చెంపబద్దలు కొడతాను తెలుసా ?

కర్ణుడు — (పిడికిళ్లు బిగించి పళ్ళు కొరుకుతూ) మాటలు మిగలవ ద్దన్నాను. తెలిసిందా ? (తలపంకిస్తూ) హుహు ! చాలా మందిని చూశాను.

అర్జునుడు — అరే, తుచ్ఛుడా ! (మీద పడబోతాడు)

(ఇంతలో ఒక పండు పట్టుకుని కుంతి వస్తుంది)

కుంతీదేవి — (ఆత్రంగా) ఆ, ఆ, ఏమిటి అర్జునా అది ?

అర్జునుడు — (ఆగిపోయి) వీడు — సూతుడు —

కుంతీదేవి — ఏమిటా దురుసుతనం ? నీకేం మతి వుందా పోయిందా ? (కర్ణుడితో) ను వ్వేమీ తొందరపడకోయ్ నాయనా ! (అర్జునుడితో) ఇతణ్ణి నేను రమ్మన్నాను. సంగతి సందర్భా లేమిటో తెలుసుకోకుండా దుడుగూ దుడుగూ మాట లనేస్తావా ? తాతయ్యగారికీ, పెద్దబాబయ్యగారికీ వర్త మానం చేస్తానుండు. అన్నా, ఆగడమూ ?

అర్జునుడు — (చేతులు జోడించుకుని వంగుని సవినయంగా) క్షమించండి అమ్మగారూ ! ఒకానొక సూతపుత్రుడు నాతో సమానంగా రత్నకంబళీమీద నుంచుంటే చూసి సహించలేక పోయాను. ఇం కెప్పుడూ ఇలా చెయ్యనండీ !

కుంతీదేవి — ఏం, అతను రత్నకంబళీమీద నుంచుంటేనే పోయిందా నీ గౌరవం? ఏమి విశేషమూ చూడకుండానే నా దగ్గిరికి పిలిపించుకున్నా ననుకున్నావా? నేను వచ్చేదాకా వుండి నన్నడగరాదూ? నీకంత తొందరేం? ఇంకెప్పుడూ ఇలా చెయ్యావు గదా?

అర్జునుడు — (చేతులు జోడించుకుని) చెయ్యానండి అమ్మగారూ! చెయ్యానండీ! తాతయ్యగారికీ, పెద్దబాబయ్యగారికీ వర్తమానించకండీ! (మోకరించి వేడుకుంటాడు)

కుంతీదేవి — సరే, ఇకలే. ఎందుకూ యిలా వచ్చావూ?

అర్జునుడు — అన్నయ్యగార్లూ, తమ్ములూ నేనూ తోటకి వెడదాం అనుకున్నాం. పెద్దన్నయ్యగారు, ఈసంగతి తమతో మనవిచేసుకుని సెలవు పొంది రమ్మని నన్ను పంపారండీ!

కుంతీదేవి — సరే వెళ్ళండి. కావలసిన పళ్ళూ అవీ ఆరగించండి కాని, అక్కడ అల్లరి చెయ్యకండేం?

అర్జునుడు — చిత్తం అమ్మగారూ!

కుంతీదేవి — చెట్లూ చేమలూ విరిచీ, తీగలూ ఆకులూ తెంపీ పోగులుపెట్టవద్దన్నా నని భీమసేనుడితో గట్టిగా చెప్పు. చీకటిపడకుండా యింటికి రండి.

అర్జునుడు — (శిరస్సు వంచుకునీ చేతులు జోడించుకునీ వుండి వెనక్కి వెనక్కి జరిగి వెళ్ళిపోతూ) చిత్తం అమ్మగారూ!

కుంతీదేవి — (కర్ణుడితో) నాయనా! జరిగిపోయినదాని కేమీ అనుకోకమ్మా! ఇతనూ నా కొడుకే. నిన్నెప్పుడూ

చూసివుండడు. అంచేతే అలా చేశాడు గాని మరేమీ కాదమ్మా! ఇదిగో, యీపండు పుచ్చుకుని యింటికి వెళ్ళి పుత్రప్రీతిగా అమ్మగా రిచ్చారని రాధమ్మతో చెప్పి కమ్మగా ఆరగించు నాయనా! (పండు అందిస్తుంది)

కర్ణుడు — అమ్మా, ఏలినవారికి చాలాచాలా నమస్కారాలు, పండు ఉంపించండి. తమకి అనుగ్రహం వుంది, అంతే చాలు. ఆపండు పట్టుకువెళ్ళి ఇక నే నారగించలేనండి. మీ అబ్బాయిగారన్న మాటలతో నాకు కడుపు నిండిపోయిందమ్మగారూ, పండు ఉంపించండి.

కుంతీదేవి — అయ్యో నాయనా, నేను మందలించాను కామటోయ్ అతణ్ణి? నేను పెద్దదాన్ని కాదూ, ఊరుకున్నానా?

కర్ణుడు — తమరు మందలించారు, ఆయన నమ్రులైనారు, మరి నాకుజరిగిన పరాభవం? నా మన స్సంతా చెడిపోయింది, ఇక పండు వద్దండీ అమ్మగారూ! ఇంతవరకూ నే నౌకరి ననకుండా, నౌకరిచేత అనిపించుకోకుండా మెళుకువగా కాలం గడుపుకుంటూ వస్తున్నాను, అదంతా నిష్ఫలం అయిపోయిందివాళ. ఇక ఆపండుతో నా కేం తృప్తి అమ్మగారూ?

కుంతీదేవి — (చకితఅయి, అంతలో తేరుకుని) అదేమిటోయ్? నువ్వీపండు పుచ్చుకుంటే గాని వల్లకాదోయ్! నేను కోరుతున్నాను మనస్సు సరిచేసుకో నాయనా! నీకంటే చిన్నవాడు కాదూ అతనూ? కుర్రతనంకొద్దీ అత నలా చేశాడు; కాని మరేమీ లేదు. పోనీ, అతను చేసిన తప్పుకి నేను —

అది నేనే చేశా ననుకో. నన్ను క్షమించు. నన్ను మన్నించు. ఏం, సరా ?

కర్ణుడు — (చెవులు మూసుకుని) వద్దుఅమ్మగారూ, వద్దు, నేను వినలేను. తమ రన్న మాట కూడా నా పేగులు తోడే స్తోంది. తమ సేవకుణ్ణి నేను. (వంగి నేల ముట్టుకుని కళ్ళకద్దు కుని) తమ రలా సెలవిప్పిస్తే నాకు జయం దొరకదు, అనుగ్ర హించండి అమ్మగారూ !

కుంతీదేవి — (పరితపిస్తూ) నీ మనస్సు కంతకష్టం కలిగిం చానా ? నీ హృదయాని కంత ఆరాటం పుట్టించానా ? మరిచి పోనాయనా. నీ మనస్సు చెడిపోయిం దనేటప్పటికి నా మనస్సు కూడా చెడిపోయి, యేమంటున్నానో తెలియక — అయితే లే. ఈశాస్త్ర నేపట్లోనూవందమాట్లయినా అన్నావు అమ్మా అని నన్ను. నువ్వూ నాకొడుకుల్లోనే లెక్క. (పండు అందిస్తూ సానునయంగా) అదంతా మరిచిపోతండ్రీ. ఇది పుచ్చుకుని ఆరగించు నాన్నా !

కర్ణుడు — (వంగి పండు పుచ్చుకుని) మహాప్రసాదం. (అది కళ్ళ కద్దుకుని) నన్ను దీవించి సెలవిప్పించండి అమ్మా !

కుంతీదేవి — నాన్నా, నిన్ననేకవిధాల కష్టపెట్టాను నేను. నా మూలంగా యివాళ నీ వుల్లాసం అంతా చెడిపోయింది. నా కళ్ళయెదట మర్మాఘాతం తగిలింది నీకు. నాన్నా, అసహా యురాలిని ఏమి చెయ్యగలనూ నేనూ ? ఈ చిచ్చుతో నా బతుకు బగ్గంపాడయిపోవలసిందే మరి దారియేదీ ? అయితే,

యింకే మనుకున్నా యేమీ లాభంలేదు. ఇక నీకు లోటు రాదు. నీ ఆభిజాత్యం యెవళ్ళకి వస్తుందీ ? నీ భవిష్యత్తు మిక్కిలీ తేజ స్వంతంగా కనపడుతోంది నాకు. గొప్పవాళ్ళలో మహాగొప్ప వాడవై అనన్యసామాన్య మైన వైభవం అనుభవిస్తావు నువ్వు, సందేహం లేదు.

కర్ణుడు —— అమ్మా, ధన్యుణ్ణి. హృదయపూర్వక మైన తమ దీవన పడసిన యీదినం నాజీవితం అంతటిలోనూ పరమపవిత్రం. అమ్మా, చూసినకొద్దీ ఈలోకం యాతనాబంధురంగా కనపడు తోంది. అన్నీ దుర్లక్షణాలే; కాని యిలాంటి బంగారు సన్ని వేశం వొకొక్కటి జతపడితే చాలు, వెనకా ముందూ సంభ వించే వన్నీ క్షణంలో మరిచిపోయి నిర్మల మైన ఆనందం అనుభవించవచ్చు. మరి సెల విప్పించండి అమ్మా!

కుంతీదేవి —— చాలా సంతోషం నాన్నా! అయితే, ను వ్వీవైపు యెప్పుడు వచ్చినా నాకు కనపడకుండా వెళ్ళవద్దు. ఊరికే వెళ్ళక, యిందాకటిలాగే యేదో పాడుకుంటూ వెళ్ళు. అది వినబడిందంటే నీకోసం నేను మా రామలక్ష్మిని పంపు తాను. నీకంఠం యెంతో హాయిగా వుంది. నువ్వుపాడినంత సేపూ నామనస్సు తాండవం చేసింది. నాప్రాణాలు లేచి వచ్చాయి! కాని యెన్ని విధాల బతిమాలినా కూచుని మాత్రం నా కానందం కలిగించావు కావు. రాధ నిన్ను వొడిలో కూచోబెట్టుకుని పరవశురా లవుతుంది. ఎవళ్ళ అదృ ష్టం యెవళ్ళకి పడుతుంది తండ్రీ ?

కర్ణుడు — తమసన్నిధిని కూచోడానికి నాకు గుండెలు తాళుతాయా అమ్మా? నాకూ తమకూ ఆకాశానికీ భూమండలానికీ వున్నంత వారవుంది. నాపూర్వపుణ్య వశాన నేను తమ సన్నిధికి రాగలిగాను. కావా లంటే నా కిది లభిస్తుందా అమ్మా? దినమ్మా తమరు నగరిలో వింటూవుండే పాట ముందర నాపాట యేపాటిదమ్మా?

కుంతీదేవి — నాయనా! ఏది మనస్సుని ఉరకలు వేయిస్తుందో హృదయాని కాప్యాయనం అవుతుందో అదీ పాట. ఎంత సాధన చేస్తే మాత్రం యేమీ, అందరి పాటకీ ఆయోగ్యత అబ్బుతుందా? చూడూ, మా అబ్బాయీలకున్నూ పాట అంటే యెంతో ఉల్లాసం. రేపు ఈపాటివేళ నిన్ను మా అబ్బాయిల కందరికీ చూపిస్తాను. వారున్నూ చాలా మంచివారు నాయనా! అర్జును డయినా యిప్పుడేదో చిరాకుగా వుండీ అలా చేశాడు. గాని - అబ్బే, ఎంత మంచివాడూ అతనూ? ఎందుకూ, వారికీ నీకూ క్షణంలో స్నేహం కలిపేస్తాను చూసుకో నేను. నిన్ను వారు చాలా ఆదరంగా చూసేటట్టు చేస్తాను కాదూ నేనూ? రేపు తప్పకుండా రా, ఏం?

కర్ణుడు — అమ్మా! (నసుకుతాడు)

కుంతీదేవి — పనికిరాదు. వల్లకాదు. వస్తా ననాలి. తప్పకుండా రావాలి కూడానూ. ఏం? ఊ అనవోయ్! చూడూ, అబ్బే! మా అర్జునుడు చాలా అమాయకుడోయ్. వారందరిలోకీ అతనే నిన్ను బాగా ఆదరిస్తాడు, వస్తావు కాదూ?

కర్ణుడు — మాపని నగరిలో సేవలు చేసుకోడంతోటే సరిపోతుం దండమ్మగారూ! ఎప్పు డయినా కాస్త తీరుబడి అయితే కాస్త విలువిద్య నేర్చుకోవాలి. నాకు వీలు కా దమ్మగారూ, క్షమించండి.

కుంతీదేవి — పోనీ, యెప్పుడు వీలయితే అప్పుడే వస్తూ వుండు. రేపు మాత్రం వొక్కమాటు రా. సరిగా, యీపాటి వేళ యెక్కడికీ వెళ్ళకుండా వారి నందర్నీ యింటోవుంచు తాను. తెలిసిందా? నీతో వొక్కమాటు మాట్లాడా రంటే నిన్నిక విడిచిపెడతారా వారు? అసలు భోజనాని కయినా నిన్ను మరో చోటికి వెళ్ళనిస్తాడా అర్జునుడు? వస్తావు కాదూ?

కర్ణుడు — తమ రింతగా సెల విప్పిస్తున్నారు కనక, రేపే అని కచ్చితంగా చెప్పలేను గాని, ఏమాత్రం వీలయినా వీలు కాగానే వస్తాను అమ్మా!

కుంతీదేవి — తరవాత కొంచెం ఆలస్యం అయినా సరే, రేపు మాత్రం తప్పకుండా వస్తూ. ఒక్కక్షణం — నువ్విక్కడ యెంతోసేపుండనే వద్దు. తప్పకుండా రా అమ్మా! సరిగా యివాళ వచ్చిన వేళకే రా, మరచిపోకేం?

కర్ణుడు — చిత్తం, మనవిచేసుకున్నాను కాదూ, సెల విప్పించం డమ్మగారూ!

కుంతీదేవి — పోనీ, ఇంకొక్క క్షణం వుండలేవూ? మరేం లేదు, నాయెదట ఆపండు ను వ్వొరగి స్తే చూద్దా మనీ-అంతే.

కర్ణుడు — వుండలేను అమ్మగారూ! ఏలినవారి ఆజ్ఞ పాలించ

నందుకు నన్ను మన్నించాలి తమరు. మా అమ్మ మతి పోగొట్టు కుని నాకోసం కాలుగాలిన పిల్లిలాగ తిరుగుతూ వుంటుం దండి. చాలా సే పయిం దండి నే నిల్లువిడిచి. మా అమ్మ ఆరాటం నేను చూడలే నమ్మగారూ! సెల విప్పించండి అమ్మగారూ!

కుంతీదేవి — అయితే వెళ్ళి రా నాయనా! ఎంత కాదన్నా తల్లిప్రాణం యెంతకొట్టుకుంటుందో నేనూ యెరుగుదును. తొరగా వెళ్ళు నాయనా! తొరగా రా మళ్ళీ.

(కర్ణుడు మోడ్పుకేలితో వెనక్కి వెనక్కి తగ్గుతూ వెళ్ళిపోతాడు)

కుంతీదేవి — ఎంత దుర్మార్గురాలినీ? ఎంత దురదృష్టవంతురాలినీ? ఎలాంటి కొడుకుని ఎలా పాడుచేసుకున్నానూ? ఎలా గయినా స్నేహం కలిపి, అనుచరుడుగా అయినా దగ్గిర వుంచుకునేటట్టు చేద్దామనుకుంటే అర్జును డెంత పనిచేశాడూ? మాట అనేటప్పటి కెంత శౌర్యం వచ్చిందీ నాయనకీ! అయ్యో, అసలైన సూర్యవంశ క్షత్రియుడు శౌర్యాని కేం తక్కువా! సూతకుల ప్రతీతివల్ల కొంచెం వెనకా ముందూ చూశాడు గాని గభీమని కలియబడితే యింకేమన్నా వుందా? పిండి పిండి అయిపోడూ అర్జునుడూ? పిడికిళ్లు బిగించాడే! పళ్లు పటపట్లాడిపోయాయే! ఎంత తేజస్సు మెరిసిపోయిందీ నాయన మొగానా? నా బతు కెలా తెల్లవారుతుందో ముందుముందు? ఇతనికీ వారికీ కత్తు కలపగలనో లేనో? దుర్యోధనాదులు చేరదీశారంటే నాయన ఆశ వుంటుందా నా కికా? ఆ తేజస్సూ ఆశౌ

ర్యమూ అర్థం చేసుకోగలవాళ్లు క్షణం అయినా వూరు కుంటారా ? ( దుఃఖిస్తూ ) ఎందుకూ ? గొడ్రాలు కూడా చెయ్య లేని పని చేశాను. చేతులారా, అప్పుడు కన్న కొడుకుని యేట్లో పారవేసుకున్నాను. నాకు నేనే తెచ్చి పెట్టుకున్నా నీ చిచ్చు. ఇది యిక ఆరేది కాదేమో ? తీరేదిన్నీ కాదేమో ? ఇంకా యెలాంటి యెంతెంత యాతనలు కట్టికడుపుతుందో నన్నిది ? నాయన రేపు మళ్ళీ వస్తాడో రాడో ? యివాళే యీ వెళ్ళడంలోనే దుర్యోధనాదుల కట్టపడిపోతాడేమో ? అయ్యో, నా కొడకా !

( కందపడి కుంతి మూర్ఛిల్లుతుంది. సరిగా, అప్పటి కిద్దరు పరిచారికలు పళ్ళేలతో యేదో తెస్తూ వచ్చి, కుంతిని చూసి తెల్లపోయి, పళ్ళే లొకచోట వుంచేసి, కుంతి దగ్గిర కూచుని అమ్మా అమ్మా అంటూ పరిచర్యలు ప్రారంభిస్తారు )

## రెండో రంగం

స్థలం :— హస్తినాపురం రాజభవనాలకు చేరికగా వున్న రాజోద్యానం. పట్నంలో కల్లా అదే గొప్పది. దానికి సాటి అయినది మరోటిలేదు. కౌరవులు ఇక్కడికే వస్తూవుంటారు. ఆకారణం వల్ల, పాండవులు సాధారణంగా యిక్కడికి రారు.

సమయం :— సాయకాలం. అప్పటికి నాలుగు గడియల పొద్దేవుంది. చల్లని గాలి కొడుతోంది. కమ్మని పూలవా

సన తెరలు తెరలుగా వస్తోంది. అక్కడక్కడ పిట్టలు ముద్దుగా కిలకిలారావాలు చేస్తున్నాయి. కొలనిలో గట్టు దగ్గిరగా వొక హంసమిథునం తేలియాడుతోంది.

సరిగా, ఆసమయాన దుర్యోధనుడూ దుశ్శాసనుడూ అక్కడికి వచ్చారు. వారు సామాన్యమైన తెల్లని ఉడుపులు ధరించి వున్నారు. మెడలో కైజార్లు కూడా లేవు. అప్పటి దాకా సాముగరిడీలు సాగించి వొక్క క్షణం విశ్రమిద్దామని తోటకి వచ్చారు వారు.

అక్కడ, నిలువెడెత్తు మాత్రమే పెరిగివున్న పోకబోదిదగ్గిర చంద్రకాంతశిలావేదిక వుంది. ఇద్దరూ అటు బయలుదేరారు.

---

దుర్యోధనుడు —— ఇంత చల్లనివేళ కూడా యింత దాహంగా వుందేమి తమ్ముడూ? చూడూ? సమీపాన భృత్యు లెవరయినా వున్నారేమోనూ?

దుశ్శాసనుడు —— కొబ్బరిబొండాలు తీయించమని సెలవా?

దుర్యోధనుడు —— కన్నుమూసి తెరిచాటప్పటికి తీయించాలి. అంత దాహంగా వుంది. (ఎడమచేతిమీదికి వొరిగి వేదికమీద కూచుంటాడు)

దుశ్శాసనుడు —— (వొక్క అడుగు ముందుకి వేసి నాలుగు వైపులా గంభీరంగా చూస్తూ) ఏయ్! ఎవ రీసమీపంలో?

(కర్ణుడు వడిగా వస్తాడు)

కర్ణుడు — (చేతులు జోడించుకుని) చిత్తం మహాప్రభూ, నేనున్నా నిక్కడ.

దుశ్శాసనుడు — ఎవరు నువ్వు?

కర్ణుడు — నా పేరు కర్ణుడు. సూతపుత్రుణ్ణి దేవరా!

దుర్యోధనుడు — రాధేయుడవు కాదూ నువ్వూ?

కర్ణుడు — ఏలినవారు సరిగా గుర్తించారు. అవును మహాప్రభూ?

దుర్యోధనుడు — తమ్ముడూ, నువ్వెప్పుడూ చూడలేదేమో కాని చాలా చురుకయినవాడు సుమా రాధేయుడు! (కర్ణుడితో) రాజహంసకు తగలకుండా, ఆవేళ, నువ్వేకాదూ మధ్యేమార్గంలోనే పట్టేశావు బాణం?

కర్ణుడు — (సవినయంగా) చిత్తం చిత్తం.

దుర్యోధనుడు — నీతో చెబుదా మని ఎన్నోమా ట్లనుకుంటూనే మరచిపోయా, నావేళ యేమి జరిగిం దనుకున్నావు తమ్ముడూ? తాతయ్యగారితో నువ్వు వేటకి వెళ్ళావూ? ఆవేళ. సరిగా యిదే వేళ. నే నీతోటలో విహరిస్తున్నాను. దూరాన చెలికత్తెలతో చెల్లాయి దుస్సల కనబడగా పిలుద్దామా అనుకుంటూ నింపాదిగా అడుగు వేస్తున్నాను. యాదాలాభంగా పక్కకి చూస్తాను గదా, అంత దూరాన, నల్లతా చొకటి మెల్లిగా పాకుతోంది. ఎందుకా అని చూడగా దానికి పది గజాల ముందు ముక్కుతో అన్యోన్యమూ దువ్వుకుంటూ కిచకిచలాడుతూ గోరువంకమిథునం క్రీడిస్తోంది. వెంటనే నేను

లాగి బాణం విడిచిపెట్టాను. కాని యింతలో వొక రాజహంస వొయ్యారినడకలతో బాణమార్గంలోకి వచ్చింది. క్షణంలో అది మాత్రం అయిపోవును. చేసేది లేక నేను దిగ్భ్రాంతుణ్ణయిపోయి వూరుకున్నాను. ; కాని యింతలో యెక్కణ్ణుంచి వచ్చాడో యీ రాధేయుడు గభీమని వచ్చి ఆ బాణం పట్టుకుని రాజహంసని రక్షించాడు. లేకపోతే నిష్కారణంగా ఆ రాజహంస చచ్చిపోయి వుండును. ఏదీ, రాధేయా, ఆ వేళ మేమిచ్చిన వుంగరం తమ్ముడికి చూపించు.

కర్ణుడు — (వంగి చేతులు జోడించుకుని) ఏలినవారు ఆగ్రహించకపోతే మనవిచేసుకుంటాను.

దుర్యోధనుడు — కానియ్యి.

కర్ణుడు — అలాంటి రత్నాల వుంగరం పెట్టుకుని తిరగడాని కర్హత లేక అది పెట్టెలో దాచుకున్నాను మహాప్రభూ !

దుశ్శాసనుడు — ఛా, ఛా ! అదేమిటి వెర్రివాడా ! ప్రభువు మెచ్చి యిస్తే సంబరపడుతూ ధరించాలి గాని —

దుర్యోధనుడు — బాణవేగాన్ని కూడా తోసేసిన వాడవు నువ్వు నీకర్హత లేకపోవడం యేమిటి రాధేయా ? మహాబాగా చేశావే ? ఇక నైనా తప్పకుండా ధరిస్తావా ?

కర్ణుడు — తెలియక తప్పుచేశాను, యిక ధరించుకుంటాను మహాప్రభూ !

దుర్యోధనుడు — అదీ పద్ధతి !

దుశ్శాసనుడు — చూడూ, కర్ణా ! ప్రభువ్వారికి చాలా

దాహంగా వుంది, యెవరి నైనా తీసుకువచ్చి కొబ్బరి బొండాలు తీయించుకురా తొరగాను.

కర్ణుడు — ఎవ రయినా యెందుకు మహాప్రభూ, సెల వయితే —

దుశ్శాసనుడు — నువ్వే చెట్టెక్కుతా నంటావా ?

కర్ణుడు — ఈమాత్రం భాగ్యానికి చెట్టె యెక్కాలా మహా ప్రభూ ?

దుశ్శాసనుడు — మరేం చేస్తా నంటావూ ?

కర్ణుడు — ప్రభువ్వారికి చాలా దాహంగా వుందని సెల విప్పించారు, మాటలతో కాలక్షేపం —

దుర్యోధనుడు — తమ్ముడూ, బొండాలు కావాలి మనకి, అంతే.

దుశ్శాసనుడు — అయితే, కానియ్యి, ఏంచేస్తావో మరి.

కర్ణుడు — ( కొబ్బరిచెట్టుకేసి చూస్తూ చిత్తం చిత్తం అంటూనే వెడతాడు )

దుర్యోధనుడు — ఏమి చేస్తున్నాడు తమ్ముడూ ?

దుశ్శాసనుడు — మనవిచేస్తా, ( చూసి చూసి ) రాళ్లు విసిరి వొ — క — టి, రెం — డు — మూ — డు —

దుర్యోధనుడు — చాలు పట్టుకురమ్మను.

దుశ్శాసనుడు — నా — లు — గు — చాలు, ఇక వచ్చెయ్యి.

దుర్యోధనుడు — రాళ్లు విసిరి పడగొట్టాడా ?

దుశ్శాసనుడు — అవు నన్నయ్యా, వీలు తప్పితే మనిషి

తలకాయ గూడా రాళ్లతో యెగరగొట్టేలా వున్నాడు.

దుర్యోధనుడు — మంచి యుక్తీ, మంచి శక్తీని, కదూ? మన కూడా వుండతగ్గవా డనిపిస్తోంది.

(అప్పుడు కర్ణుడు నాలుగు కొబ్బరి బొండాలు పట్టుకుని వస్తాడు)

దుశ్శాసనుడు — నీ దగ్గిర కత్తి వుందా మరి?

దుర్యోధనుడు — కత్తి కూడా అక్కర్లే దనుకుంటాను. అవునా రాధేయా?

కర్ణుడు — చిత్తం దేవరా!

దుశ్శాసనుడు — తొరగా కావాలి.

(కర్ణుడు పక్కకి వెళ్లి రాతిమీద వేసికొట్టి రెండు కాయలు వొలిచి రంధ్రాలు చేసి పట్టుకువచ్చి ఇద్దరికీ చెరొకటీ యిస్తాడు)

కర్ణుడు — మిగిలిన రెండు కాయలున్నూ కొడతాను మహాప్రభూ!

దుశ్శాసనుడు — ఇక నా కక్కరలేదు. ఒకటి కొట్టి అన్నయ్యగారికి పట్టుకురా. ఏమి అన్నయ్యా?

దుర్యోధనుడు — ఒకటి తెమ్మను.

(కర్ణుడు మరో కాయ కొట్టి తెచ్చి అందిస్తాడు)

దుర్యోధనుడు — (అది కూడా పుచ్చుకుని) చాలా బాగుంది. (దుశ్శాసనుడితో) ను వ్వింకోటి పుచ్చుకోవుటోయ్!

కర్ణుడు — పట్టుకువస్తాను మహాప్రభూ!

దుశ్శాసనుడు — వద్దు వద్దు, నాకు చాలండీ అన్నయ్యా?

దుర్యోధనుడు — (కర్ణుడితో) అది కొట్టి నువ్వు పుచ్చుకో.

కర్ణుడు — చిత్తం దేవరా!

(పక్కకి వెళ్ళిపోతాడు)

దుర్యోధనుడు — ఇంకోటి కావాలి, కదూ?

కర్ణుడు — (వచ్చి) చాలు మహాప్రభూ! కానయితే యేలినవారి కేక వినబడేటప్పటికి నాకున్నూ చాలా దప్పికగానే వుందండి. కొలనికి వెడదామని బయలు దేరాను. అందుకోసమే నే నీ తోటలోకి వచ్చాను మహాప్రభూ! ఇంతలో తమ దర్శనమూ, వొక కొబ్బరి బొండం పుచ్చుకోడమూ, ఆపైని యేలినవారి అపారకరుణాకటాక్షలాభమూ — నాదాహం తీరిపోయింది మహాప్రభూ!

దుర్యోధనుడు — (కర్ణుడికేసి చూస్తూనే దుశ్శాసనుడితో) ఎంత చక్కగా తేల్చాడో చూశావా తమ్ముడూ? మన సూతుల్లో యింత పొందికగా మాట్లాడగలవా రెవ రయినా వున్నారా? చాలా తెలివయినవాడు కూడానూ రాధేయుడు. ఏమంటావు తమ్ముడూ?

దుశ్శాసనుడు — సందేహ మేం అన్నయ్యా?

దుర్యోధనుడు — (కర్ణుణ్ణి చూస్తూ) ఇతని కళ్ళల్లో యేదో దివ్యశక్తి మెరుస్తోంది, గుర్తించలేకుండా వున్నాను. రాధేయుణ్ణి చూసినకొద్దీ నా కేదో అపూర్వమైన అనుబంధం వొకటి స్ఫురిస్తోంది. (కర్ణుడితో) ఇలా రా.

కర్ణుడు — చిత్తం మహాప్రభూ! (కొంచెం ముందుకి వచ్చి చేతులు కట్టుకునుంచుంటాడు)

దుర్యోధనుడు — ఇంకా రావాలి.

కర్ణుడు — (మరో అడుగు వేసి ఆగిపోతాడు)

దుర్యోధనుడు — ఇంకా.

కర్ణుడు — (మరో అడుగు వేసి) సెల విప్పించండి.

దుశ్శాసనుడు — ప్రభువు సెల వయింది, సందేహిస్తావేం, యింకా దగ్గిరికి రావోయ్!

దుర్యోధనుడు — ఏమిటో అనుకుంటున్నాడు పాపం! నువ్వు వెళ్ళి చెయ్యి పట్టుకుతీసుకురా తమ్ముడూ!

(దుశ్శాసనుడు అలా చేస్తాడు. అప్పటికీ కర్ణుడు కొంచెం వెనక్కి జంకుతూనే వుంటాడు)

దుర్యోధనుడు — భయం లేదు రావోయ్! ఇతని మొగాన (కర్ణుణ్ణి దగ్గిరగా తీసుకుని) యేమిటీ యీ తేజస్సు తమ్ముడూ?

దుశ్శాసనుడు — (కర్ణుడి కళ్ళల్లోకి చూసి) అన్నయ్యా, తమరు సరిగా గుర్తించారు. వాలకం చూడగా రాధేయుడు మసిపాతను కట్టిన మణిగా కనపడుతున్నాడు. ఇతని దగ్గిర నిగూఢశక్తి యేదో వుంది గాని యితను సామాన్యుడు కాడు.

దుర్యోధనుడు — కనిపెట్టావు కదా? (కర్ణుడి కుడిచెయ్యి అంతా తడివి చూసి) నాచేతిలో వున్నది హస్తమా వజ్ర దండమా తమ్ముడూ? ఈకవచం చూడూ, పూసినట్టూ అతికేసినట్టూ లేదుటోయ్?

దుశ్శాసనుడు — అవునండీ అన్నయ్యా!

దుర్యోధనుడు — ఏపనివాడు చేశాడో సాక్షాత్తూ మెలి పించేశాడోయ్ కుండలాలు! వీటికాంతి నాకళ్ళల్లో దివ్యజ్యోతిని ప్రతిష్ఠిస్తోంది.

దుశ్శాసనుడు — అన్నయ్యా, నా మనవి యేమిటంటే? ఇతణ్ణి మనం భృత్యుడుగా కాక —

దుర్యోధనుడు — నీకూ అదే తోచిందీ?

కర్ణుడు — నన్ను భృత్యుడుగానే వుండనివ్వండి మహాప్రభూ! అదే మాకు మన్నన దేవరా!

దుర్యోధనుడు — నువ్వుండవోయ్! తమ్ముడూ, ఏమి వక్షస్థలమూ యిదీ? విజయలక్ష్మీసింహాపీఠం కాదుటోయ్?

దుశ్శాసనుడు — ఇంకా సందేహమా అన్నయ్యా? సామాన్యులకు — అంటే సూతులకే కాదు, రాజపుత్రుల కున్నా యీావపుశ్రీ దుర్లభం కదా?

దుర్యోధనుడు — ఏమి చూపులోయ్?

దుశ్శాసనుడు — ఆచూపులకున్న పదునుతూపులకుంటేనా?

దుర్యోధనుడు — బాగా చెప్పావు. సరిగా చెప్పావోయ్! కనక, క్షణం అయినా యితణ్ణి విడిచివుండకూడదు మనం.

కర్ణుడు — మహాప్రభూ, మహాప్రభూ!

దుర్యోధనుడు — వెర్రిబాగుల మనిషి, తన శక్తి తనకు తెలియని ఆంజనేయు డితను. తమ్ముడూ, ఇతని తేజస్సుతో నాహృదయసముద్రం ఉత్తుంగతరంగితం అవుతోంది. (వినడం

అభినయించి ) " ఇతను నీకుడిభుజం " అని యెవరో చెబుతున్న ట్టవుతోంది. ( కర్ణుణ్ణి కౌగిలించుకుని ) హాయ్, హాయ్! ఏమి సుఖమూ? ఎంత ఆప్యాయనంగా వుందీ ఇతని స్పర్శ! ఇందాకానే యీఆలింగనభాగ్యం అనుభవించివుంటే కొబ్బరిబొండాలు పుచ్చుకోవలసిన అగత్యమే లేకపోయి వుండును. కర్ణా! నా ప్రాణమా! నువ్వు మరో లాగ అనుకోకు, కౌరవకులానికీ నీకూ దృఢతర మైన అనుబంధం వుంది. సూతు ణ్ణనుకుంటూ నువ్వేమీ కించపడనక్కరలేదు. ఈకౌరవయువరాజు నీకు ఏకోదరుడి కంటేనూ సన్నిహితుడు. తెలిసిందా? నా సంపత్తిలో — నా వైభవంలో — నా సుఖంలో-నా ఆనందంలో మొదటి భాగం - యెక్కువ భాగం నీది. నువ్వనుభవించగా మిగిలిందే తక్కిన మా నూర్గురిదిన్నీ. తమ్ముడూ!

దుశ్శాసనుడు. — తమ సెలవుకి అడ్డేమిటి అన్నయ్యా! ( కర్ణుణ్ణి కౌగిలించుకుని ) తమరు సెలవిప్పించిన దాల్లో యేమీ తేడాలేదు. ఇతని ఆలింగనంవల్ల నాకు రక్తంలో రక్తం, కండలో కండ, మనస్సులో మనస్సు, హృదయంలో హృదయం, జీవంలో జీవం మిళిత మయి పోయి నట్టుంది. నరాలకు అపూర్వమైన బింకమున్నూ సంక్రమించి నట్టుంది.

దుర్యోధనుడు — కనక, మరి పద. ఈసంగతి బాబయ్యగారికి విన్నవించుకుందాం. కర్ణా!

కర్ణుడు — మహాప్రభూ!

దుర్యోధనుడు — ఇక ఆర్ధతి కట్టిపెట్టు. ఆమార్గం విడిచి

పెట్టెయ్యి. అధోరణి మరిచిపో. మిత్రమా అను. తమ్ముడూ, రథం ఆయత్తం చేయించవోయ్ !

దుశ్శాసనుడు — చిత్తంఅన్నయ్యా, (వెళ్ళిపోతాడు)

దుర్యోధనుడు — (కర్ణుడితో) అక్కడ మనవాళ్లందరూ వున్నారు. మా కవచాలూ, మా వుష్ణీషాలూ, మా వుత్తరీయాలూ — సర్వమూ అక్కడే వున్నాయి. ముందక్కడికి వెళ్ళి అక్కణ్ణుంచి నగరికి వెడదాం పద. (చెయ్యి పట్టుకుని బయలుదేరతాడు)

కర్ణుడు — మహాప్రభూ ! —

దుర్యోధనుడు — ఆమాట వద్దన్నాను.

కర్ణుడు — ప్రభూ !

దుర్యోధనుడు — అదీ పద్ధతి ; కాని యింకా తగ్గించు.

కర్ణుడు — ముందు నామనవి చిత్తగించాలి. తమ ఆజ్ఞకి నే నెప్పుడూ బద్ధుణ్ణే. అయితే, ప్రపంచం అంటే తమరూ నేనూ మాత్రమే కాదు. జనుల సంఖ్య అనేకకోట్లు కావడం అలా వుండగా, ప్రవృత్తులున్నూ అనేకకోట్ల విధంగావున్నాయి. అవి నిరంకుశాలు. రాజశాసనం జనులను నిర్బంధించవచ్చు ; కాని వారి ఆశలనూ వూహలనూ వుద్దేశాలనూ సంకల్పాలనూ నిరోధించలేదు. తమ నిశ్చయం కౌరవచక్రవర్తి నిరాక్షేపంగా అంగీకరించనే వచ్చు. కౌరవచక్రవర్తి సందేశం లోకులున్నూ ఆక్షేపించకే పోవచ్చు. కాని సత్యం వుంది. ధర్మం వుంది. సంప్రదాయం వుంది. వాటి కెదురుతిరగడం మంచిది కాదు.

దుర్యోధనుడు — ఏమిటి పర్యవసానం ?

కర్ణుడు — అది యెవరికి తెలియనిదీ ? తాము క్షత్రియుల నేను సూతుణ్ణి. తాము ప్రభువులు, నేను భృత్యుణ్ణి. తమ నాకూ అనుబంధం వుందంటే యిది కాదూ ? హృదయం వున్న చోట యింతకంటే మరేమి కావాలీ ? పోషించుకోగ గితే సేవ్యసేవకానుబంధం చాలదూ యెంతెంత లేసి పనుల సాధించడాని కయినా ?కనక, మనఅనుబంధం ఆస్థితిలోనే వుం నియ్యవలసిం దని నా ప్రార్థన. ఇప్పటికే ఈశరీరమూ ఈహృద యమూ తమ సొత్తయివున్నాయి. క్షణం కిందట మరోచోట గాయపడ్డ నాహృదయంమీద తమరు అమృతం చిలకరించారు ఇంతకంటే నా కానందం కలిగించగల సన్నివేశం మరేమి వుంటుందీ ; తాము అభిలషించినదాన్ని — తాము సంల్పించిన దాన్ని సిద్ధింపచెయ్యడాని కది చాలు ; కాని దేశంలో విడ్డూరాలు పుట్టనివ్వవద్దు. ఈసూతపుత్రుణ్ణే ప్రత్యక్షంగా -

దుర్యోధనుడు — నీ ఆశయం బోధపడింది. ఇక చెప్పన క్కరలేదు ; కాని లోకం గతానుగతికం. దానికి విచక్షణ చేసుకోగల యోగ్యత లేదు. ముందేమాట పుడుతుందో దాన్ని పట్టుకుని అది పాకులాడుతుంది. సత్యం దానికి భిన్నం కావచ్చు. ధర్మమున్నూ సర్వాత్మనా దానికి ప్రతికూలం కావచ్చు. సత్యమా లోకమా అంటే సత్యం ముందు లోకం యేపాటిది ? ధర్మమా నమ్మకమా అంటే ధర్మం ముందు నమ్మకమున్నూ ఏపాటిదీ ? కారణం యేమిటో మరి, నీ మహా

జ్వాలజీవితం అజ్ఞాతంగా వుంది. మణి అని తెలిసిన తరవాత దాన్ని యింకా అంధకారంలో పాతి వుంచడం శ్రేయస్కరం కాదు. రాజు విష్ణ్వంశసంభూతు డనే మునీశ్వరుల మాట నిశ్చయమే అయితే నా నిర్ణయం చెడ్డది కానేరదు.

కర్ణుడు — కాని —

దుర్యోధనుడు — అనవసరంగా ప్రసంగం పెంచవద్దు. ఈకౌరవయువరాజు మాట చెల్లి పోవలసిందే.

కర్ణుడు — తమ హృదయం మహోదారం కావడంవల్ల తమరు నా దగ్గిర యేదో ఆభాసజ్యోతి చూసి పొరబడుతు న్నారు; కాని నిజంగా నేను మట్టిముద్దను. నాలో ఘనీభవించిన అంధకారమే గాని వెలుగు లేనే లేదు.

దుర్యోధనుడు — తప్పుమాట అది. ఉన్న ప్రతిబంధకం అంతా అదీ! నీలో అప్రతిద్వంద్వమైన ప్రభావం నిహితమయి వుంది; కాని నీకళ్ళు పొరలు కమ్మివున్నాయి. తెలిసిందా! నే నందుకు అమోఘచికిత్స చేస్తాను పద.

కర్ణుడు — నా గుండెలు తాళడం లేదు మహాప్రభూ!

దుర్యోధనుడు — మంచిదే, ముందుముందు నువ్వెన్నో గుండెలు తియ్యవలసివున్నావు. దానికిది పూర్వరంగం. ఇక చాలించు, పద. (రెక్కపట్టుకుని కర్ణుణ్ణి తీసుకుని వెళ్ళిపోతాడు.

1937 మార్చి భారతినుంచి.

( సవరణలతో )

# లక్ష్యసిద్ధి

## పాత్రలు

ధృతరాష్ట్రుడు
భీష్ముడు
విదురుడు
ద్రోణుడు
కృపుడు
అశ్వత్థామ
కర్ణుడు
అర్జునుడు
ధర్మరాజు
భీముడు
గాంధారి
కుంతీదేవి
బ్రాహ్మలు, పరిచారకులు

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రూపికలు

# లక్ష్యసిద్ధి

హస్తినాపురంలో కురుకుమారుల అస్త్రవిద్యాప్రదర్శనం.

ఇక ప్రదర్శనం ప్రారంభం అవుతుం దనగా, కౌరవచక్రవర్తి ధృతరాష్ట్రుడు దేవీశతపరివృతుడై వచ్చి ప్రధానప్రేక్షాగారంలో ఆసీను డయినాడు.

రాణుల కందరికీ రాణి అయిన గాంధారి అతని పక్కనే కూచుంది.

అటు ధృతరాష్ట్రునితోనూ, యిటు కుంతితోనూ మాట్లాడ్డానికి అనువుగా, విదురుడు వారి కిద్దరికీ మధ్యగా కూచున్నాడు.

ధవళవస్త్రాలు కట్టుకుని, వెండితీగల్లాగ మెరుస్తున్న యజ్ఞోపవీతాలకు తోడు తెల్లని గంధపుప్పూతలూ, పూలదండలూ ధరించి, కొంచెం నెరసిన గడ్డంమీసాలతో గంభీరదర్శనుడై, నభోమధ్యభాగాన అంగారకసహితు డైన మధ్యందినమార్తాండుని లాగ ద్రోణుడు అశ్వత్థామతో కూడా వచ్చి తన స్థానంలో కూచున్నాడు.

ఈప్రదర్శనంలో పాల్గొనదలచిన కుమారు లందరూ తమ తమ ఆయుధాలు ధరించి వచ్చి ద్రోణుని వెనక నుంచున్నారు.

వారి రాకా, వారివర్చస్సూ చూసి ఉత్సాహం పట్టలేక జనం హర్ష ధ్వానాలు చేశారు.

భీష్ముడు సూచించగా, చక్రవర్తి యింగితం గుర్తించి ద్రోణుడు సెలవిచ్చాడు.

వెంటనే సామాన్యులు వచ్చి మొదట తమ కౌశలం కనబరిచారు పొంగిపోతూ.

వారి తరవాత ధర్మనందనుడూ, నకులసహదేవులూ, దుశ్శాసనాదులూ కూడా తమ నైపుణ్యం బాగా చూపించారు.

అది చూసి జనం సంతోషించకపోలేదు; కాని భీష్ముని ప్రతాపమూ, ధృతరాష్ట్రుని బలపరాక్రమాలూ, పాండురాజు శౌర్యసాహసాలూ చూసివుండినందున వారి కవి యేమంత నచ్చలేదు.

ఈస్థితిలో, ద్రోణు డాజ్ఞాపించగా, సింగపుకొదమల్లాగ కొరకొర చూసుకుంటూ వచ్చి సుయోధనుడూ భీముడూ రంగంలో ప్రవేశించారు.

అందరూ చకితు లయినారు.

హస్తినాపురంలోనే కాదు, దేశం అంతటా కూడా, గదా విద్యలో జగత్తులో మరి అంతవారు లేరని ప్రతీతి వ్యాపించిపోయి వుంది.

వారి కిద్దరికిన్నీ మాత్సర్యమున్నూ పెరిగివుంది.

దీంతో, ప్రారంభించడం తడవుగా వారిగదాయుద్ధం భయంకరం అయిపోయింది.

వారిద్దరిలో యెవరెక్కువో చాలాసేపటిదాకా యెవరూ గుర్తించలేకపోయారు.

ఇదంతా విదురుడు ధృతరాష్ట్రునకు వివరంగా చెబుతూనే వచ్చాడు.

చివరికి సుయోధనుని పక్షంగా ప్రశంసలు రేగాయి.

అది పాండవపక్షాన వుద్రేకం పుట్టించింది.

దీంతో ఆయిద్దరికీ కసిపెరిగిపోయింది.

వారి పూనికా, లాఘవమూ, కౌశలమూ — ముఖ్యంగా రోషమూ చూసి భీష్మాదులున్నూ వూగిపోయారు.

సుయోధనుడూ భీముడూ కూడా, తమలో యెవరో వొకరు కూలవలసిందే అని స్థిరపరచుకుని పోరుతున్నట్టు స్పష్టపడిపోయింది.

అంచేత, అపాయం రావచ్చునని శంకించి అశ్వత్థామను పంపి, వెంటనే ద్రోణుడు వారి ప్రదర్శనం ఆపుచేయించాడు.

అది అలా జరగడం యెవరికీ యిష్టంలేదు.

అలాంటి సమయాన ఆగడం సుయోధనుడికీ భీముడికీ కూడా సుతరామూ యిష్టంలేదు.

ఓపట్టాన ఆగనూ లేకపోయారు వారు.

ఆగాక అయినా, చాలా సేపటిదాకా ప్రకృతిస్థులున్నూ కాలేకపోయారు.

కుంతిమాత్రం అందుకు చాలా సంతోషించింది.

గొప్పఆపద తప్పిపోయినట్టు ఆమె నిట్టూర్పున్నూ విడిచింది.

ద్రోణుడు పాండవపక్షం వహించిన ట్టుం దని చాలా మం గొణుక్కున్నారు.

భీష్ముడూ విదురుడూ భీమ సుయోధనుల భవిష్యత్తె వూహించుకోసాగారు.

ధృతరాష్ట్రుడు తన రాచఠీవి అంతా కనపరిచాడు.

తరవాత ద్రోణుడు అర్జునుడికి సెలవిచ్చాడు.

ప్రేక్షకు లందరూ మళ్ళీ సావధాను లయినారు.

తనకు పోటీ యెవరా అని యెదురుచూశా డర్జునుడు.

అది గుర్తించి కృపాచార్యుడు కన్ను గీటాడు.

అనుకున్న సందేహం తీరగా, వొక్కమాటు రాచ ఠెక్కు చూపించి అర్జునుడు తన నైపుణ్యం కనపరచసాగాడు.

నిజానికి, అత నెంతో చాతుర్యం కనపరిచాడు.

ఎంతెంతలో చమత్కారాలూ చేశాడు.

అసాధ్యపనులున్నూ చేశాడు కొన్ని.

కాని, రక్తికట్టలేదు.

ఏదో వెలితి వుండిన ట్టతనికే ఆవేదన కలిగింది.

ప్రేక్షకులు చప్పచప్పగా వూరుకున్నారు.

వారికి వింత తోచిందే గాని వుత్సాహం కలగలేదు.

పాండవపక్షపాతులున్నూ మందుతిన్న ట్టుండిపోయారు.

భీష్ముడు నాలుగైదుమాట్లు ద్రోణుడి కేసి చూశాడు.

"ఉజ్జీ యింకా కుదరలేదూ?" అంటూ ధృతరాష్ట్రుడ తరిమి తరిమి అడగసాగాడు.

కుంతి సూక్ష్మబుద్ధి యిదే బాగుం దనుకుంది; కాని ఆమె పేరహృదయం మాత్రం చాలా కించపడిపోయింది.

ఆమె మాతృహృదయం కూడా "యిది చిట్టితండ్రికే లోటు" అని కుతకుతలాడిపోయింది.

"ఎవరయినా లేస్తున్నారా ?" అని భీము డటూ యిటూ చూడసాగాడు.

దుశ్శాసనుడు, సుయోధనుడికేసి "యేమిటిదీ ?" అన్నట్టు చిరాగ్గా చూడసాగాడు.

"ధనురాచార్యులవారు అర్జునుడికి వుజ్జీ యేర్పరచ రేమీ ?" అని ప్రేక్షకులు గుసగుసలాడుకోసాగారు.

కర్ణు డొక్కడే అర్జును ణ్ణెదుర్కోగలవా డనీ, కర్ణుడి యెదట అర్జును డెలాగా తీసిక ట్టయిపోతా డనీ, యిది గుర్తించే ద్రోణు డిలా చేశా డనీ కొందరు స్థిరపరుచున్నారు.

ఈగుసగుసలతో అప్పటిదాకా నిస్తరంగసముద్రం అయి వుండిన రంగభూమి గాంభీర్యం భంగపడిపోయింది.

భీష్ముడు పూర్తిగా విసిగిపోయాడు.

విద్యాస్పర్థతో విలక్షణ తేజస్సంపన్ను లయి వుండిన కుమారుల యెడల అప్పటి కతనికి రాగద్వేషాల కతీత మైన మన స్థితి యేర్పడిపోయింది.

"ఇక ఆగలేను, వెళ్ళి వురికేస్తా" నన్నట్టు సుయోధనుడి కేసి ఆకొన్న సింహప్పిల్లలా చూశాడు కర్ణుడు.

సుయోధనుడున్నూ అంతకంటేనూ ఆత్రపడుతూనే మొదట

కొంచెం సంశయించి, చివరి కేమయినా కానీ అని సాహసించి రెక్కపట్టుకుని గభీ మని కర్ణుణ్ణి లేవదీసి "ఇక మాటతక్క" దన్నట్టు ద్రోణుడికేసి చురుకూ చురుకూ చూశాడు.

ఇదంతా చూసి, ద్రోణుడున్నూ తన నిండు హృదయం తొందరపెట్టగా వొక్కమాటు భీష్ముడికేసి సాకూతంగా చూసి కర్ణున కనుజ్ఞ యిచ్చేశాడు.

ద్రోణుడి చూపు లందాయి, అంతే.

ఒక్క దూకున రంగద్వారాన జబ్బ చరిచి నిలబడ్డాడు,కర్ణుడు శౌర్యోష్మతో కంపించిపోతూ.

ఆధ్వనికి అర్జును డులిక్కిపడ్డాడు.

ప్రేక్షకులు దద్దిరిల్లి పోయారు.

కర్ణుణ్ణి చూసి కృపుడు గతుక్కుమన్నాడు.

భీష్ముని హృదయం కలిచిన ట్టయిపోయింది.

కుంతి దెబ్బతిన్న లేడిలాగ విరగబడి విదురుడికేసి చూసింది.

విదురు డీసంగతి చెప్పగా చక్రవర్తి చాలా గంభీరంగా మందహాసం చేశాడు.

జనసమూహం వొక్కమాటు గమ్మున పొంగిపోయింది.

వెంటనే నిశ్చలమున్నూ అయిపోయింది.

---

కర్ణుడు — అర్జునా, మనం యిద్దరమూ ద్వంద్వయుద్ధం చేదాం కాసుకో.

అర్జునుడు — (వెంకితనంగా) పలువా, ఇక్కడికి నిన్నెవరు

పిలిచారూ? పరాత్మపరిమాణా లెరక్కుండా వాగడానికి నీ కెవ రనుజ్ఞ యిచ్చారూ?

ద్రోణుడు — (విసుగ్గా) అర్జునా, నువ్వు మర్యాదాతి క్రమణం చేస్తున్నావు. ఎవరి కయినా అనుజ్ఞ యిచ్చేవా రెవరో గుర్తు లేదూ?

అర్జునుడు — (సిగ్గుపడి వూరుకుంటాడు)

కర్ణుడు — (అర్జునుడితో, నిర్లక్ష్యంగా) నాకు అలుగులతో బదులు చెప్పు, నోటి తుంపర్లతో గాదు. అస్త్రవిద్యావిశా రదుల కందరికీ యీస్థలం సామాన్య మైనది. ఇక్కడ విధినిషే ధా లెవరికీ లేవు, తెలుసా? నీ విశిష్టత కూడా లేశమూ లే దిక్కడ, మిడిసిపడకు.

ధర్మనందనుడు — (భీష్ముని కేసి సాకూతంగా చూస్తాడు)

భీముడు — (చూస్తా వేమిటి దెబ్బ కొట్టెయ్యి అన్నట్టు అర్జునుడి కేసి చూస్తూ తల యెగర వేసుకుంటాడు)

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) ఆచార్యులవారు వాళ్ల కిద్దరికీ వుజ్జీ వేశా రేమి పాపమూ?

విదురుడు — (కుంతితో జనాంతికం) ధనుర్విద్యలో వాళ్లు ఇద్దరే వొకరికొకరు సాటి. అంతటివారు మరి జగత్తులోనే లేరు ఎక్కడా.

కుంతీదేవి — (జనాంతికం) ఇది సౌమ్యంగా తప్పిపోయే వుపాయం చూడండి.

విదురుడు — (జనాంతికం) ఏమీ లాభం లేదు. వాళ్ల

కిద్దరికీ పోటీ జరగవలసిందే. మన మిప్పు డేమి మాట్లాడినా మర్యాదా తక్కుదు.

సుయోధనుడు — కర్ణా, యేమిటి తరవాయి ?

కర్ణుడు — నాపిలుపు వినపడ్డట్టే లేదు, తరవాయి దాకా యేమివుంటుందీ ?

భీష్ముడు — అప్రస్తుత ప్రసంగాలతో కాలహరణం కావడం బాగా లేదు. ధనురాచార్యులవా రిప్పు డేమిసెలవిప్పిస్తారూ ? అర్జునుడూ కర్ణుడూ తలపడ్డం వుందా లేదా ?

ధృతరాష్ట్రుడు — దాని బాధ్యత యెవరిది, విదురా ?

విదురుడు — ముందు అర్జునుడిది. అతను తప్పితే తరవాత ఆచార్యులవారిది.

అశ్వత్థామ — అర్జునుడు తప్పడం యెందుకు రావాలీ ?

కుంతీదేవి — ( విదురుడితో జనాంతకం ) మామయ్య గారూ, బావయ్యగారూ మాత్రమే కాకుండా, మీరు కూడా యెగసనతోస్తా రేమి కర్మమూ ?

విదురుడు — ( జనాంతికం ) వ్యవహారం మొదటే వశం తప్పింది. ఘర్షణ జరక్కుండా యిక వడిమళ్లదు. అన్నిటికీ అర్జునుడి మిడిసిపాటు ప్రాణాంతకంగా వుంది.

కుంతీదేవి — ( జనాంతికం ) అదే వచ్చింది పుట్టిమునక.

విదురుడు — ( జనాంతికం ) ఇక మనం చేసే దేమి వుందీ ?

భీష్ముడు — కర్ణా !

కర్ణుడు — కన్నెత్తి చూడ్డానికూడా గుండెలు తాళడం

లేనట్టుంది, నేను చెయ్యవలసిన కేమి వుంది మహాప్రభూ?

భీష్ముడు — ( మొగం చిట్లించుకుంటాడు )

ధర్మనందనుడు — తమ్ముడూ! ( లోపల్లోపల పళ్లు కొరుక్కుంటూ తీవ్రంగా చూస్తాడు )

భీముడు — ఎందుకు తమ్ముడూ, మాటలు ముదరనిస్తున్నావూ?

అర్జునుడు — ( ఒక్కమాటు ధర్మనందనుడి కేసి తేరిపార చూసి ) పెద్ద లందరూ వొక్క విధంగా సెల విచ్చాటప్పుడిక నాకేమి సందేహమూ? కర్ణా, మరి రా.

ప్రేక్షకులు పెద్దకోలాహలం చేస్తూవుండగా కర్ణుడూ అర్జునుడూ ద్వంద్వయుద్ధం ప్రారంభిస్తారు. కొంత సేపు సమానంగా పోరు జరిగాక కర్ణుడు పర్జన్యాస్త్రం ప్రయోగిస్తాడు. పెద్ద మేఘపటలం వచ్చి అర్జునుణ్ణి కప్పేస్తుంది. అర్జునుడు తప్పించుకోలేక అవస్థపడుతూ వుంటాడు. ప్రేక్షకులు రణగొణధ్వని చేస్తారు. ఇదంతా చూడలేక కుంతీదేవి మూర్ఛిల్లి పోతుంది. విదురుడు చందనోదకాసేకం చేసి ఆమెని తేరుస్తాడు. అప్పటికి తేరుకుని అర్జునుడు అనిలాస్త్రం ప్రయోగించి ఆమేఘపటలం విడగొట్టి బయటపడతాడు. ఇదంతా చూస్తూవున్న ద్వంద్వయుద్ధసమాచారనిపుణుడు కృపాచార్యుడు, అర్జునుణ్ణి రక్షించాలనినిశ్చయించుకుని రంగంలోప్రవేశిస్తాడు)

కృపాచార్యుడు — (గభీమని కర్ణార్జుల మధ్య నుంచుని) ఆగండి. శాంతించండి.

(ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ వులిక్కిపడతారు. అర్జునుడు అమ్మయ్యా అనుకుని వొకపక్కగా నుంచుంటాడు. ప్రేక్షకుల్లో పెద్దకోలాహలం రేగి కొంతసేపటికి అణగారుతుంది. కుంతి దెబ్బతిన్న లేడిలాగ విదురుడికేసి చూస్తుంది)

కర్ణుడు — ఏమీ? ఎందు కాగాలీ? శాంతించవలసిన అగత్యం యేమి వచ్చిందీ యిప్పుడూ?

కృపాచార్యుడు — (స్థిరనిశ్చయంతో) వచ్చింది. కనక నే ఆగమన్నాను. తెలిసిందా?

ద్రోణుడు — (తీక్ష్ణంగా చూస్తూ) ఏమి టా అగత్యం? ఆపించడాని కయినా సాగించడాని కయినా —

భీష్ముడు — ఎవరితో చెప్పి, యెవరి సెలవు పొంది తమరీ పని చేశారు, కృపాచార్యులవారూ?

కృపాచార్యుడు — బాధ్యత అంతా నావొక్కడిమీదే వుందని కాదు. (భీష్ముడితో) ఈసన్నివేశం తమరు గుర్తించి వుండనిదిన్నీ కాదు?

విదురుడు — పనిపడితే, ఆపుచెయ్యడానికి, ధనురాచార్యుల వారికీ పెద్దబాబయ్యగారికీ సత్తా లేదూ?

కృపాచార్యుడు — ఇంత చిన్నపనికి వారు పూనుకోవాలా?

అశ్వత్థామ — చిన్నపని కేతగుదురా మామయ్యా మీరు?

ధృతరాష్ట్రుడు — మరి, పెద్దబాబయ్యగారి కేమని మనవి చేస్తారు కృపాచార్యులవారూ ?

కృపాచార్యుడు — మనవిచేసుకుంటున్నాను, మహాప్రభూ!

కర్ణుడు — మొదటే వారి అనుజ్ఞ పొందకపోడానికిన్నీ కారణం —

కృపాచార్యుడు — (రోషంగా) మిడిసిపడకు. కర్ణా, అధిక ప్రసంగం కట్టిపెట్టు. అర్జునుడు కురుకులజుడు. పాండుమహా రాజులుంగారికీ కుంతీదేవమ్మగారికీ పుత్రుడు. రాజధర్మబంధుర చరిత్రుడు. మరినువ్వు? నువ్వితనితో యుద్ధం చెయ్యా లంటే నీవంశం యేవో, నీతలిదండ్రు లెవరో చెప్పు. నువ్వు రాజు వైతివా, నీతో యితను పెనగులాడుతాడు. లేదూ? లేదు. ముం దిది తేలాలి.

కర్ణుడు — (హేళనగా) ఆచార్యులవారి కిప్పటికి తోచింది రక్షణోపాయం. అయితే. మహాత్మా, ఇంతవరకూ తమరు కునికిపాట్లుపడుతున్నారా? లేక, ఇంతా జరిగాక, అర్జునుడు ఉన్నట్టుండి రాజపుత్రు డయిపోయాడా? ఇప్పటిదాకా నాతో ద్వంద్వయుద్ధం చేసినందుకు అతని కేదయినా ప్రాయశ్చిత్తం విధించబోతున్నారా తమరు ?

ప్రేక్షకులు కోలాహలం చేస్తారు.

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) కృపాచార్యుల వారు డొంకంతా కదుపుతున్నారు. ఇప్పుడయినా వారిని కూర్చో మనగూడదూ ?

విదురుడు — (జనాంతికం) డొంకంతా కదిలేపోయింది. ఇక అట్టుపుట్టాణీ లన్నీ బయటికి వచ్చేస్తాయి. ఇప్పు డిక కృపాచార్యులవారు నుంచున్నా వొకటే కూచున్నా వొకటే.

ధృతరాష్ట్రుడు — రాజపుత్రులతో కలిసి ధనుర్వేదం వుపదేశించడానికి ద్రోణాచార్యులవారికీ తమకున్నూ అభ్యంతరం లేనప్పుడు — సమర్థుడితో — తనకంటే వొక వన్నె యెక్కువే అయినవాడితో — యువరాజు ప్రాణసఖుడితో — ఎవరితో భుజమూ భుజమూ రాసుకుంటూ తా నింతవరకూ విద్యనేర్చుకున్నాడో ఆసహాధ్యాయితో — ఇప్పటిదాకా తాను ద్వంద్వయుద్ధం చెయ్యనే చేసిన కుమారకర్ణుడితో మరికొంతసేపు ద్వంద్వయుద్ధం చెయ్యడానికి అర్జునుడికి ఆభిజాత్యం అడ్డు వచ్చిందా ?

భీష్ముడు — ధనురాచార్యులవా రిందు కేమంటారూ ?

ద్రోణుడు — ఇది పూర్తిగా ధర్మాతిక్రమణం. తలకు మించిన పని. వ్యవహారం నావశం తప్పింది. ఇక సర్వానికీ తమరే వున్నారు.

విదురుడు — అది సరే. మరి ప్రకృతం ?

కుంతీదేవి — (విదురిడితో జనాంతికం) మీరు మళ్లీ పెళ్లగిస్తా రేం పాపమూ ?

విదురుడు — (జనాంతికం) మేమిక్కడ వున్నందు కిది తప్పదు. జయాపజయాల ప్రశ్నకా దిది. ఇప్పుడు ధర్మనిర్ణయం జరగాలి. నేను కలగజేసుకోక తప్పదు.

దుశ్శాసనుడు — అర్జునా! ఏకలవ్యుడివిషయమై పన్నిన యుక్తివంటిదే కర్ణుడివిషయమై కూడా పన్నుకుని వుంటే యిప్పు డీవిషమసంధి రాకపోవును గాదుటోయ్?

భీముడు — ఇప్పుడు వచ్చింది మాత్రం యేమిటోయ్?

దుశ్శాసనుడు — కర్ణుడికి చాలలేక మరో విధంగా గోడదూకెయ్యవలసిన దుష్కర్మోయ్!

భీముడు — ఆ! (అంటూ మండిపడుతూ లేవబోతాడు)

ధర్మనందనుడు — (భీముణ్ణి అదిమిపెడుతూ) భీమసేనా! విషయం పెద్దల్లో నలుగుతోంది, ఓపికపట్టు.

సుయోధనుడు — ఇది పెద్దల్లో నలగడమే గుణ మయితే కావలసినంత నలగవచ్చు. నలగవలసిందిన్నీ యెక్కువగానే వుంది. కనక, గుండె లుంటే యెవ రయినా సరే "నేను" అంటూ యెదట నిలవబడవచ్చు.

ధృతరాష్ట్రుడు — కృపాచార్యులవా రిక్కడే వున్నారా?

కృపాచార్యుడు — ఏమీ వుండకా? పరమపవిత్ర మైన భరతకులగౌరవం కాపాడ్డానికి నావూనిక. దీనికి మహ్మోలి నవా రేమి సెలవిస్తారూ?

ధృతరాష్ట్రుడు — అది తమరు కాపాడినట్టా, రాపాడినట్టా?

కృపాచార్యుడు — నేను మనవిచేసుకునేది —

ధృతరాష్ట్రుడు — అది పెద్దబాబయ్యగారితో మనవి చెయ్యండి తమరు.

భీముడు — ఎవరు ఎవరితో మనవిచెయ్యడాని కయినా కర్ణ

డచ్చంగా సూతపుత్రుడు. ఇందులో యెవ రెరగని దేమివుంది ?

(విదురుడూ కుంతీ చకితులయి చూసు కుంటారు)

సుయోధనుడు — నిజమే, యెవరూ యెరగని దేమీలేదు. ఎవరూ యేమిన్నీ దాచడమూ లేను. భీమసేనా, రెండుకళ్ళూ బాగా తెరుచుకుని చూడు. మీ అయిదుగురి తేజస్సూ యేకం అయినా కర్ణుడి తేజస్సులో సహస్రాంశం అయినా అవుతుం దేమో పరకాయించుకో. ఇంతటి తేజస్వి అధమాన్వయంలో పుడతా డేమో చేతనయితే ఆలోచించుకో. లేడి కడుపున పులి పుడుతుం దేమో యెవరి నయినా అడుగు. శూరుల జన్మమూ, సురల జన్మమూ, యేరుల జన్మమూ తెలుసుకోడం యెవరికయినా సాధ్యమా ? సత్క్షత్రియప్రభువు లనేకులు విప్రుల వల్ల పుట్టలేదూ ? ఇంద్రుడి వజ్రాయుధం యెక్కడ పుట్టిందో, కుమారస్వామి పుట్టుక యెక్కడో, ద్రోణాచార్యులవారి జన్మ యెక్కడో విన్నావా ? ధర్మవిదు లైన యీ — మన — కృపా చార్యులవారు రెల్లుగడ్డిలో పుట్టారు, తెలుసా ? ఇంతెందుకూ ? మీ అన్నదమ్ముల అయిదుగురి జన్మలూ యెలాంటివోయ్ ?

భీముడు — (తలవంచుకుంటాడు)

ధర్మనందనుడు — (కిందుగా పక్కకి చూస్తాడు)

అర్జునుడు — (పెడమొగం అవుతాడు)

ధృతరాష్ట్రుడు — ( గంభీరముద్ర వహిస్తాడు )

గాంధారి —(మొగం చిట్లించుకుని అనిష్టత కనపరుస్తుంది)

విదురుడు — ( కుంతికేసి చూస్తాడు )

కుంతీదేవి — ( విదురుడితో జనాంతికం ) సుయోధనుడు కొండవలి పుచ్చుకుని పేగులు కోసేస్తున్నాడు.

విదురుడు — ( కుంతితో జనాంతికం ) అతని చేతికి ఆకొండవలి అందించినవాడు మన భీమసేనుడు.

కుంతీదేవి — ( జనాంతికం ) ఇక తుం చెయ్యం డిది.

విదురుడు — ( జనాంతికం ) దాని కదే తునిగిపోయింది. ( కృపాచార్యుడితో ) తమ రిది ఆలోచించే చేశారా ?

సుయోధనుడు— నేను కృపాచార్యులవారిని సవినయంగానే ప్రార్థిస్తున్నాను. అయితే నాకిప్పుడు కచ్చిత మైన ప్రత్యుత్తరం కావాలి. కర్ణుడు అడిగినదానికి తమ రేమి సెలవిప్పిస్తారూ ?

కృపాచార్యుడు — ( తల వంచుకుంటాడు )

సుయోధనుడు—తమరు నాకుప్రతుత్తరంచెప్పాలి, తప్పదు.

కృపాచార్యుడు — ( మాట్లాడడు )

సుయోధనుడు — కుమారవర్గంలో మీరు విషబీజాలు నాటుతున్నారు, అవునా కాదా ?

భీముడు — పెద్దలకు దురుద్దేశా లారోపించడం —

ధర్మనందనుడు — ( భీముడి తొడ చరిచి ) స్స !

ధృతరాష్ట్రుడు — విదురా !

విదురుడు — ఏమి సెలవు ?

ధృతరాష్ట్రుడు — కృపాచార్యులవా రేమి చేస్తున్నారూ ?

విదురుడు — నిర్వికల్పసమాధిలో వున్నారు.

ధృతరాష్ట్రుడు — బాగుంది.

సుయోధనుడు — ఇప్పటికే చాలా కాలహరణంఅయింది. ఈముసుగులో గుద్దులాట లింకెంతసేపూ? అయ్యా, కృపాచార్యులవారూ! రాజయిన అర్జునుడితో రాజు కాని కర్ణుడు యుద్ధం చెయ్య తగడనే కాదూ యిప్పటికిన్నీ తమ నిర్ణయం?

కృపాచార్యుడు — ఇప్పటికే కా దెప్పటికీ అంతే.

సుయోధనుడు — కులంగలవాడూ, శౌర్యం గలవాడూ, గొప్ప సేనలు గలవాడూ రాజు లనిపించుకుంటూరు కదూ?

కృపాచార్యుడు — సందేహమేం?

సుయోధనుడు — ఆమాటమీద వుండండి. ఈధర్మాలు తమకు జ్ఞాపకం వుండడమూ, ఈనిండుకొలువున వీటిని తమ రంగీకరించడమూ చాలా గొప్పసంగతి. కనక, యిదే, యీక్షణంలోనే యిన్ని వేల మహాజనుల సమక్షాన — అసాధారణధర్మవిదు లైన (వొత్తి) తమరు సాక్షిగా కర్ణుణ్ణి అంగరాజ్యాధీశుడుగా చేస్తున్నాను. రాజ్యాభిషేకమున్నూ యిప్పుడే జరిగించేస్తున్నాను.

(సభలో పెద్ద కోలాహలం. కృపాచార్యు డులిక్కిపడతాడు. అర్జునుడు తెల్లపోతాడు. ధర్మనందనుడు మొగంవంచుకుంటాడు. భీముడు చిన్నబుచ్చుకుంటాడు. భీష్ముడు శిరఃకంపంచేస్తాడు. కుంతీ విదురుడూ గతుక్కుమంటూరు)

ధృతరాష్ట్రుడు — (గాంధారితో) దేవీ!

గాంధారి — ఏమి సెలవు?

ధృతరాష్ట్రుడు — కర్ణు డెంత కయినా అర్హుడే. అయితే, యీ రాజ్యప్రాప్తికి కారణం మరొక టయితే బాగుండిపోయేది.

గాంధారి — చిత్తం.

కుంతీ విదురుడూ మళ్లీ గతుక్కుమంటారు.

సుయోధనుడు — (భీష్ముని కేసి తిరిగి దోసిలివొగ్గి)ఇందుకు ముందుగా తాతయ్యగారి అనుమతి కోరుతున్నాను.

భీష్ముడు — నువ్వుచేసింది అపాత్రదానం మాత్రం కాదు. అంగీకరించాను.

సుయోధనుడు — ధన్యుణ్ణి. (తండ్రి కేసి తిరిగి దోసిలివొగ్గి) బాబయ్యగారి సమ్మతి కూడా వేడుకుంటున్నాను.

ధృతరాష్ట్రుడు — సమ్మతించాను.

సుయోధనుడు—కృతార్థుణ్ణి. (దుశ్శాసనుడితో)తమ్ముడూ! వెంటనే కాంచన పీఠాదికం తెప్పించవోయ్!

దుశ్శాసనుడు — చిత్తం అన్నయ్యా!

దుశ్శాసనుడు వెనక్కి తిరిగి చూస్తాడు. అదిగ్రహించి భృత్యులు స్వర్ణాసనం మొదలైనవి తెచ్చి అక్కడ వుంచుతారు.

సుయోధనుడు — మిత్రమా, కర్ణా!

కర్ణుడు — చిత్తం యువరాజా! (మోడ్పు కేలితో వచ్చి సుయోధనుడి యెదట నమ్రుడవుతాడు)

సుయోధనుడు — (కర్ణుణ్ణి స్వర్ణాసనంమీద కూచోబెట్టి) నాకు కుడిభుజమూ, కౌరవసామ్రాజ్యానికి మూలస్తంభమూ,

కానున్న కర్ణుణ్ణి అంగరాజ్యాధిపతిగా అభిషేకిస్తున్నాను. ఈశుభముహూర్తంలో బ్రాహ్మణోత్తములకు సహస్రాయుత గోకులం వాగ్దానంచేస్తున్నాను. తమ్ముడూ, తెల్లవారడం తరవాయిగా బ్రాహ్మణోత్తములను సత్కరించాలి సుమా!

దుశ్శాసనుడు — చిత్తం అన్నయ్యా!

ఒక బ్రాహ్మడు — యువరాజులుంగారు కర్ణుడి దివ్యతేజస్సు చక్కగా గుర్తించారు. అత నెంత కయినా తగినవాడే.

మరో బ్రాహ్మడు — ధనుర్విద్యలో రాజన్యుల కందరికీ శిరోమణి కర్ణుడు. ఇప్పుడు యువరాజులుంగారు చూపించిన ఆదరాభిమానాలు అతని అభ్యుదయానికి చక్కని దోహదం అవుతాయి.

ఇంకో బ్రాహ్మడు — కర్ణుడిరాచరికంలో మాఅంగరాజ్యం సామ్రాజ్యంలో శిరోమణి అవుతుంది.

బ్రాహ్మలందరూ — కర్ణుణ్ణి మేము త్రికరణాయా ఆశీర్వదిస్తున్నాము.

సుయోధనుడు — కృపాచార్యులవా రిప్పు డేమంటారో?

కృపాచార్యుడు — (మొగం వంచుకుని వూరుకుంటాడు)

దుశ్శాసనుడు — అర్జునుణ్ణి తప్పించడానికి మరో వుపాయం వెదుకుతున్నారు వారు.

ఏదో అనా లని భీము డుద్రేకంతో లేస్తాడు; కాని ధర్మనందనుడు, చెయ్యి పట్టుకునిగుంజి అతణ్ణి కూచోపెడతాడు)

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) ప్రతీవిషయం లోనూ 'పుల్లవిరిచినట్టు మాట్టాడీ, కసిపెరిగే పనులు చేసీ సుయోధనుణ్ణి భీముడూ, కర్ణుణ్ణి అర్జునుడూ రెచ్చగొడుతు న్నారు. దాని కితర్లు కొందరు దోహదం చేస్తున్నారు.

విదురుడు — (జనాంతికం) అదీ కీలకం. మన బంగారమే మంచిది కాదు.

ధృతరాష్ట్రుడు — విదురా!

విదురుడు — ఆ,

ధృతరాష్ట్రుడు — ఏమి జరుగుతోంది?

విదురుడు — మనవిచేస్తా.

సుయోధనుడు — (సగర్వంగా సభ అంతా కలయజూసి) అంగరాజా, జబ్బచరిచి యీమాటు పిలవ్వోయ్?

కర్ణుడు — (జబ్బ చరిచి) ఏమి అర్జునా, కాసుకుంటావా?

(అర్జునుడు ధర్మనందనుడికేసిచూసి వూరుకుంటాడు. భీముడుద్రిక్తుడవుతాడు. ధర్మనందనుడు భీముణ్ణి అదిమిపెడుతూ మొగం వంచుకుంటాడు.)

కర్ణుడు — (మళ్ళీ జబ్బ చరిచి మీసం దువ్వి సింహ నాదమున్నా చేసి) అర్జును డొక్కడే కాదు, కౌంతేయుల్లో మాద్రేయుల్లో ఎవ రయినా సరే, రావచ్చు.

సుయోధనుడు — అదీ పద్ధతి.

కర్ణుడు — సూతపుత్రుడు అంగరా జయితే, పాండు పుత్రులు వానప్రస్థాశ్రమం స్వీకరించారా?

సుయోధనుడు — (కృపాచార్యుని కేసి చూస్తూ వెటకారంగా మందహాసంచేస్తాడు)

అర్జునుడు — (మళ్ళీ ధర్మరాజు కేసి చూసి వూరుకుంటాడు)

కర్ణుడు — రాధేయుణ్ణి నేను. మళ్ళీ పిలుస్తున్నాను. శపథం చేసి చెబుతున్నాను. బతకతలుచుకుంటే మగటిమి నమ్ముకుని యెప్పుడూ, నాయెదట పడనద్దు.

(సుయోధనుడు ఉత్సాహం కనపరుస్తాడు. కళ్ళు మూసుకుని కుంతి నిట్టూర్పు విడుస్తుంది. విదురుడు కుంతి కేసి చూసి వూరుకుంటాడు.)

భీముడు — (గభీ మని లేచి) నేను పాండవుల ప్రతిష్ఠ —

ధర్మనందనుడు — (భీముణ్ణి మళ్ళీ కూచోపెట్టి) కర్ణుడి ప్రత్యర్థనం మేము అంగీకరిస్తున్నాము.

భీముడు — (అదీ వరస అన్నట్టూగీస లాడతాడు)

ధర్మనందనుడు — అయితే —

భీముడు—(మళ్ళీ అదేమిటి అన్నట్టు రోషంగా చూస్తాడు)

ధర్మనందనుడు — తాతయ్యగారికీ, పెద్దబాబయ్యగారికీ, ధనురాచార్యులవారికీ వొక్క మనవి.

భీముడు — ( అదేమిటి అన్నట్టు ఆలోచనలో పడతాడు)

ధర్మనందనుడు — కర్ణుడూ, అర్జునుడూ ద్వంద్వయుద్ధానికి తలపడాలంటే అందుకు చాలిన పొద్దుందా ?

భీముడు — ( ఇందులో వున్న యుక్తి యేమిటీ అన్నట్టు కిందికి చూస్తూ ఆలోచిస్తాడు )

ధర్మనందనుడు — అందుకు తమరు సెలవు దయచేస్తారా?

("మంచి యుక్తి, సెబాస్" అన్నట్టు తల యెగర వేసుకుంటూ భీముడు చిటికె వేస్తాడు. సుయోధనుడు ధర్మనందనుణ్ణి ఏవగించుకుంటూ దుశ్శాసనుడికేసి చూస్తాడు. "బతికిపోయావు" అన్నట్టు కర్ణుడు అర్జునుడికేసి నిరసనగా చూస్తాడు. కుంతి విదురుడితో "అమ్యాయ్యా" అంటుంది. అశ్వత్థామ ద్రోణుడికేసి చూస్తూ పెదవి విరుస్తాడు. ద్రోణుడు కృపాచార్యుడికేసి నిష్ఠురంగా చూస్తాడు)

ధృతరాష్ట్రుడు — ధర్మనందనుడి దూరదృష్టి ప్రశంసార్హంగా వుంది, విదురా!

విదురుడు — చిత్తం, పొద్దుచాలదు.

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) అలా చెప్పండి.

ధృతరాష్ట్రుడు— పెద్దబాబయ్యగారి సెలవేమిటో కనుక్కో.

భీష్ముడు — ధర్మనందనుడి ప్రశ్న యుక్తిసహంగానే వుంది. అంగరాజుకీ అర్జునుడికీ – ఆయిద్దర్నీ గురించి యింతమందికీ మహోద్రేకం పెరిగివున్న సమయంలో మళ్ళీ, వారు కలియబడితే అది తేలడానికి నిజంగా పొద్దుచాలదు. సగం అయినా కాకుండానే సంధ్యావందనసమయం అయిపోతుంది.

ద్రోణుడు — అంతే.

సుయోధనుడు — ఆచార్యోత్తమా! అయితే. జరుగుతూ జరుగుతూ వున్న పరీక్షకు ఆభాసకారణాలతో విఘా

తం కలిగించి, మళ్లీ ప్రారభించడానికి వీలులేకుండా కాలహరణం అయేటట్టున్నూ చేసి అంగరాజుకి చెందవలసిన —

ద్రోణుడు — దాని కిప్పు డేమి వచ్చిందీ? ప్రారంభంలో యెలాంటి తికమకలు వచ్చినా పర్యవసానం కర్ణుడి కనుకూలమే అయింది కాదూ?

భీష్ముడు — ద్రోణాచార్యులవారు నిగ్గుతేల్చారు.

ద్రోణుడు — కర్ణుడి పక్షంగా చూస్తే అంగరాజ్యాధిపత్యం సామాన్య మైనదా?

ధృతరాష్ట్రుడు — చిరంజీవి సుయోధనుడి తరవాత ఈ కుమారవర్గంలో కర్ణుడికి తప్ప అంత యోగ్యత మరెవరి కుందీ?

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) విన్నారా?

విదురుడు — (కుంతితో జనాంతికం) ఒక కంట దుఃఖమూ ఒక కంట ఆనందమూనూ, ఏది తప్పుతుందీ చేసుకున్న తరవాతా?

ద్రోణుడు — అంగరాజు పరాక్రమమున్నూ శంకించవలసిందికాదు.

సుయోధనుడు — అంటే?

ద్రోణుడు — ఇందులో విప్పిచెప్పవలసిం దేమి వుందీ?

భీష్ముడు — ఆచార్యోత్తమా! ఇందులో యెవరిని కాదని యెవరిని చంక కెక్కించుకోడానికీ వీలులేదు. శిష్యులందరూ తమ కొక్కటే. ఈఅస్త్రవిద్యాసందర్శనరంగమున్నూ అందరికీ సమానమే. కనక, యెవరికి ముట్టవలసింది వారికి —

ద్రోణుడు — చిత్తం చిత్తం, మనవిచేసుకుంటాను. కౌరవ సార్వభౌములూ, రాణీవాసమూ, కౌరవపితామహులూ, రాజబంధువులూ, రాజపురుషులూ, నాగరకులూ, కుమార వర్గమూ — ఈయావన్మందితోనూ నిండిబలిసివున్న యీ మహాసభలో నేను ప్రకటించేది యేమిటంటే ? ఇవాళ సర్వ విధాలా విజయం అంగరాజుది.

ప్రేక్షకుల్లో పెద్దకోలాహలం రేగి అణగారుతుంది. కర్ణుడు లేచి నమ్రుడై సభ నుద్దేశించి అంజలిబంధంతో శిరస్సువంచి నమస్కరిస్తాడు.

కుంతీదేవి — (విదురుడితో జనాంతికం) మామయ్యగారి ధోరణి సందేహాస్పదంగా లేదూ ?

విదురుడు — (కుంతితో జనాంతికం) వారు మరో విధంగా మాట్లాడ్డానికి వీలులేదు. ఆపదవి అలాంటిది.

సుయోధనుడు — గురుదేవా, కృతార్థుణ్ణి. కృపాచార్యుల వారూ, నేను త్రికరణయూ విన్నవించుకుంటున్నాను. ఇదంతా తమఅనుగ్రహం. తమరు అంగరాజుకి మహోపకారమే కాదు, మహోపదేశమున్నూ చేశారు. అంగరాజా, నీవిజయం నా నాకమితానందకరంగా వుంది. అంగరాజ్యాభిషేకార్ద్రమయిన నీశిరస్సు కౌరవసార్వభౌమదంపతులకు పాదపీఠం చేసుకుని వారి సామంతకోటిలో ఉన్నతపదవి ఆర్జించుకో. నీఅమందానంద భాష్పధారతో తాతయ్యగారి దివ్యపాదాలు అభిషేకించి వారిని నిత్యప్రసన్నులను చేసుకో. నిన్నింతవాణ్ణి చేసిన ద్రోణా

చార్యులవారి అనుగ్రహం యింకా సంపాదించుకో.

సభ్యులందరూ కోలాహలంగా లేచి గుంపులు గుంపులుగా చేరి, తలోవిధంగానూ అనుకుంటూ వుంటారు. ఒకచోట విదురుడూ కుంతీ యిద్దరే వుంటారు.

కుంతీదేవి — చాలా గొడవ పెరిగింది.

విదురుడు — ఏ మవుతుందో తెలుసా?

కుంతీదేవి — స్పష్టంగా చెప్పలేను. ఏదో మూసుతుంది.

విదురుడు — ఏదో అని సందేహం యెందుకూ? సర్వనాశంతప్పదు.

కుంతీదేవి — (దుఃఖిస్తూ) నేను పాపాత్మురాలిని.

విదురుడు — మాట్లాడవద్దు. మనం నిమిత్తమాత్రులం.

కుంతీదేవి — కడుపుచిచ్చు —

విదురుడు — అది యివాళటిదా?

దూరాన మళ్లీ కోలాహలం రేగుతుంది.

ఒక కంఠం

తప్పుకోండి, తప్పుకోండి. రాధా అతిరథుడూ అంగరాజయిన తమ కుమారుణ్ణి పొదువుకోడానికి చేతులు చాచుకుని వస్తున్నారు దారివ్వండి, దారివ్వండి.

కుంతీదేవి — (చకిత అయి) ఆ!

విదురుడు — (కుంతికేసి ఆత్రంగా చూస్తాడు)

మరో కంఠం

ఓహో! ఓహో! కొడుకు సాష్టాంగపడగా
రాధ అలా వుండగానే అతణ్ణి పొదువుకుని
పరవశురా లయిపోయింది. హాయి, హాయి,
ఏమి మాతృభక్తి, ఏమి పుత్రవాత్సల్యం!

మెరుపుదెబ్బ తిన్నట్టయిపోయి కుంతీదేవి
"శివా! శివా" అంటూ మూర్ఛిల్లు
తుంది. "ఎవ రక్కడ? చందనోదకం,
చందనోదకం" అంటూ విదురు డామె
దగ్గిర కూచుంటాడు.

1939 జనవరి ఆంధ్రభూమినుంచి
(సవరణలతో)

---

సరస్వతీ పవర్ ప్రెస్ — రాజమహేంద్రవరము 9017/55

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## అనుభవాలూ - జ్ఞాపకాలూను

మిక్కిలీ అపూర్వమైన గ్రంథం యిది. అంటే, మన తెనుగు వాఙ్మయంలో యీరకం గ్రంథాల కిదే మొదటిది.

మొదట వైదికవిద్యలు నేర్చుకుని, 13 వ ఏటనే చిన్న కథలు రాయడం ప్రారంభించి, అగత్యం అయి తెనుగులో పాండిత్యం గడించుకోడంలోనూ రచన చెయ్యడంలోనూ శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఎదురుకున్న ప్రతిబంధకాలూ, అనుభవించిన నిర్బంధాలూ, పొందిన ఆవేదనా, పట్టిన దీక్షా, చేసినసాధనా, ఆసాధనలో వారు కనపరిచిన పరాకాష్ఠా, తత్ఫలితంగా వారు పొందిన విజయాలూ, గ్రంథ ప్రకటనలో కలిగిన — కలుగుతూనూ వున్న యిబ్బందులూ — ఈవివరాలు పాఠకుల హృదయాలు కరిగించడమే కాదు, రసమహితాలున్నూ చేస్తాయి చదివితే.

అనేకచోట్ల -- అనేకసందర్భాల్లో — అనేకమార్లు రాతప్రతే చదివించుకుని విని అనేకులు మిక్కిలీ ముగ్ధులయివున్నారు.

మొదటి సంపుటం ఈ 1955 మార్చిలో విడుదల అవుతుంది. డిసెంబరు ఆఖరుకి 2, 3, 4 సంపుటాలున్నూ అచ్చుపూర్తవుతాయి.

ఒక్కొక్క సంపుటం పరిమితి నాలుగేసి వందల పేజీలు.

ఒక్కొక్క సంపుటం వెల నాలుగేసి రూపాయలు.

కలాభివర్ధనీ పరిషత్తు

రాజమహేంద్రవరం